# గోరిల్లా రాక్షసి

డిటెక్టివ్ నవల

(ఆనందరావు పరిశోధన)

మొదటి భాగము

రచన:

"ముక్తామాల"



ఫోను నెం. 64

టెలిగ్రాం: బాబా

ప్రకాశకులు

ఆంధ్రరత్న బుక్ డిపో తెనాలి.

ప్రొ॥ గ్రంది లక్ష్మయ్య గుప్త

రైల్వేస్టేషన్ రోడ్డు, తెనాలి.

1956



వెల 0—8—0.

: ఈ రచయిత చే రచింపబడిన :

## *** అత్యద్భుత డిటెక్టివ్ నవలలు ***

Acc. No. 11643

ఆటంబాంబు ... ... ...
(రెండుభాగములు)

రంగరాజు ... ... ...
(అతని స్వీయచరిత్ర)

చిన్నరెడ్డిహత్య ... ...

మొండిచెయ్యి ... ...

తెల్లభూతం ... ...

వజ్రపుటుంగరం ...

: మొదలగునవి :

# 1

ఉదయం ఆరయింది. మాఘమాసపు చలి గుంటూరు తారు రోడ్లమీద విశ్వవిహారం చేస్తున్నది. చలికి భయబడ్డ చాలామంది యింకా దుప్పట్లలోంచి బయటకు రాలేదు. యింత చలిలోనూ గుంటూరు జనరల్ ఆస్పత్రి రోడ్డుమీద షుమారు రెండొందల మంది గుమిగూడి ఆస్పత్రిగేటును తోసుకొని లోపలకు పోటానికి ప్రయత్నిస్తున్నారు. గేటులోపలయివున్న ముగ్గురు పోలీసులూ; జనంలోవున్న అయిదారుగురు పోలీసులూ లాఠీలుపైన గాలిలో ఆడిస్తూ "వెళ్లిపొండి! వెళ్లిపొండి!" అని హెచ్చరిస్తున్నారు. ఆశ్చర్య సంభ్రమాలతో ఒకర్నొకరు తోసుకుంటున్న ఆగుంపు పోలీసువారి మాటల్ని ఖాతర్ చేయటంలేదు.

ఏమీ వేడిలేని సూర్యకాంతి ఆస్పత్రి కప్పులమీదా వరండాల్లోనూ వెన్నెలమాదిరిగా పరచుకొంటున్నది. ఆస్పత్రి ఆవరణలోవున్న పోలీసులారీ, సూపర్నెంటు చిన్నకారూ, ఫైరుయింజనుబాపతు ఆంబులెన్సూ లేఎండకు మెరుస్తున్నాయి.

ఆపరేషన్ గదిముందు వరండాలో కుర్చీలోకూర్చున్న పోలీసు సూపర్నెంటు గోపాలరావు నాయుడూ సర్కిలు యిన్స్పెక్టరు వేణూ యింకాయిద్దరు ఆఫీసర్లూ గదితలుపులకేసి అదే పనిగా చూస్తున్నారు. రెండునిమిషాల అనంతరం గదిలోంచి పెద్దసర్జన్ టవల్తో చేతులు తుడుచుకుంటూ బయటకువచ్చి,

"రాత్రి మూడుగంటల ప్రాంతలో ప్రాణం పోయింది. మృతుడు చనిపొయ్యేముందు విపరీతంగా భయపడిన కారణాన గుండె పగిలింది యినప చువ్వల్లాంటి–బహుశా–గోళ్లవంటి సాధనాల్ని పదిట్ని గొంతులో గుచ్చి అతన్ని పైకెత్తారు. అంగుళన్నరపైగా పొడుగున్న ఒక బిరుసైన వెంట్రుక చనిపోయినవాని దుస్తుల్లోవుంది. యిందువల్ల 'గోరిల్లారాక్షసి' అని నమ్మబడుతున్న ఆజంతువే యితన్ని హత్యచేసిందని నానమ్మకం"

యింతసేపూ నిలబడి సూపర్నెంటుతో చెప్పిన డాక్టరు మెట్లు దిగాడు. పోలీసుఆఫీసర్లుకూడా మౌనంతో ఒకరి మొఖాలొకరు చూచుకుంటూ ఆయన్ననుసరించారు.

డాక్టరుగారి ప్రవేట్ గదిలో అంతా కూర్చున్నారు. సర్కిలు యినస్పెక్టరు వేణు, ఎదట కుర్చీలో కూర్చొని ఆలోచిస్తున్న సూప ర్నెంటు గారిని చూస్తున్నాడు. సూపర్నెంటు కొద్దిక్షణాల అనంతరం,

"డాక్టర్! యింత జనసమర్ధంగల పట్టణంలోకి 'గోరిల్లారాక్షసి' రావటం విడ్డూరంగాలేదూ? మీరుకూడా ఆ జంతువే హత్యచేసిందని ఖాయపరుస్తే ...... మేం నమ్మాల్సిందేగా ........."

డాక్టరు ఒకక్షణం ఆలోచించాడు. "నా అభిప్రాయం మాత్రం యిదేదో జంతువనే అనిపిస్తున్నది.... అయితే ఒకపనిచేద్దాం. పది నిమిషాల్లో మనం దీనివిషయం క్షణ్ణంగా తెలుసుకోవచ్చు ..." అంటూ టేబిలుమీద ఫోన్ రిసీవరు పైకెత్తి 'హలో! 222 కావాలి' అన్నాడు. కనెక్షన్ దొరికిన అనంతరం,

"హలో గుడ్‌మార్నింగ్ డాక్టర్!

నేను గవర్నమెంటు సర్జన్ వెంకటేశ్వర్రావుని. యిప్పుడే పోలీసు వారు మీపేటనుంచి ఒక శవాన్ని తెచ్చారు పరీక్ష కోసం......"

"... ... ... ... ... ... ..."

"అహాఁ. నాకలాగే తోస్తున్నది. వీలుంటే మీరొకసారి వచ్చి చూస్తే మంచిదని నావుద్దేశ్యం"

"... ... ... ... ..."

"అలాగే. O K." డాక్టరు రిసీవరు క్రిందపెట్టేసి, "డాక్టరు సూర్యప్రభాకరరావు వస్తున్నాడు." అన్నాడు సూపర్నెంటుతో.

సూపర్నెంటుగారు తలూపి వూరుకొన్నారు.

అనుకున్నట్టే పదినిమిషాల అనంతరం డాక్టరు సూర్యప్రభాకర రావు కారు గేటుదగ్గరజనాన్ని అతికష్టంమీద తప్పించుకొని డాక్టరుగది ముందుకువచ్చి ఆగింది. అందులోంచి ముప్పయి అయిదేళ్ళ వయస్సు గల సూర్యప్రభాకరరావుదిగి డాక్టరు గదిలోకి వచ్చాడు. ఆయన గొప్పతనానికి ఆ గదిలోని వాళ్ళంతాలేచి మర్యాద చూపించారు. సూర్యప్రభాకరరావుకు 'షేక్‌హాండ్' యిచ్చిన సర్జన్ "చాలావిచిత్రంగా

వుందిహత్యా.... రండి ... చూద్దాం" అని ఆపరేషన్ గదికి బయలు దేరాడు. పోలీసుఆఫీసర్లు అక్కడ కుర్చీల్లో కూర్చున్నారు.

ఇద్దరు డాక్టర్లనీచూచిన 'మేల్‌నర్స్' ఆపరేషన్ గదితలుపులు తెరచి యిద్దరూ లోనికివెళ్ళగానే మూశేసాడు. ఆపరేషన్‌కు అనువైన టోపీ, ముక్కుగుడ్డా వగైరాలు పెట్టుకొన్న ఆ యిద్దరూ టేబిలు దగ్గరకు రాగానే యింకోనర్సు బల్లమీది శవంపైన తెల్లటి గుడ్డను తొలగించాడు.

విపరీతమైన భయంతో నిలువుగుడ్లుపడి, తెరచుకున్న నోట్లో నుంచి బయటకుసాగిన నాలుకతో వికృతమైన శవం మొఖాన్నిచూచి సూర్యప్రభాకరరావు కనుబొమలు ఆశ్చర్యసూచకంగా పైకెత్తాడు. రక్తం; మట్టి, బురదతో ఆ శవందుస్తులన్నీ అసహ్యంగావున్నాయి. పొట్టిగా దృఢంగావున్న ఆశవం కొయ్యలే బిగుసుకొనివుంది

డాక్టరు సూర్యప్రభాకరరావు ఆశవంమెడని పరీక్షించాడు. అనేక గాయాలతో శవం గొంతుక చితికిపోయి కొన్నినరాలుతెగి బయట కొచ్చినయి. అన్నిగాయాల్ని శ్రద్ధగా పరిశీలించిన అనంతరం ఆయిద్దరు డాక్టర్లూ ఆఫీసులోకివెళ్ళి కుర్చీల్లో కూర్చుని నిశ్శబ్దంగా ఆలోచించారు.

"మీావుద్దేశ్యంకూడా...... సర్జనుతో ఏకీభవిస్తున్నారుకదూ?" సూపర్నెంటు అన్నాడు డాక్టరు సూర్యప్రభాకరరావుని చూస్తూ.

"అంగీకరించాల్సిందే ... ఎందుకంటారా? .... ఆ చనిపోయిన వ్యక్తి దాదాపు 120 పౌన్లు బరువుంటాడు. మెడమీది గాయాలు బాగా పరిశీలించితే అంతకంటే షుమారు పదిరెట్లు బలంకలిగి ఏడున్నర అడుగులకుపైన ఎత్తుకలిగిన వాళ్ళకయితేనే అతన్ని గొంతులో గోళ్లు కానీండి లేక యినపముళ్లు కానీండీ గుచ్చి పైకెత్తే అవకాశం కలగదు. యీ వెంట్రుకవుందే, యిది, మనిషి వెంట్రుకకు చాలాదగ్గరగావుంది. అయితే మనుష్యుల్ది మాత్రం కాదని నావూహ. ..."

"క్షమించండి. ఒక్కమాట. మీారన్నట్లు మంచిబలశాలియైన వ్యక్తి ఒక పెట్టెమీాదో రాయిమీాదో ఎక్కి చేతికి వుక్కుగోళ్ళు పెట్టుకొని తాను యీ విధంగాచేసి యిదేదో రాక్షసకృత్యమని ప్రజల్ని,

ముఖ్యంగా మనల్ని మభ్యపెట్టటానికి వీలులేదంటారా?" సూపర్నెంటు త్వరత్వరగా తన అభిప్రాయాన్ని తెలియ జేసాడు.

సూర్యప్రభాకరరావు, "యీ వెంట్రుకే కనక మనకు దొరక్క పోయిన పక్షంలో మీరన్నట్లే ఒప్పుకో వీలుంది." అంటూ మళ్ళీ బల్ల మీదున్న ఆ బిరుసైన వెంట్రుకనితీసి బూతద్దం క్రిందపెట్టి పరీక్షించి, ఒక నిమిషం తర్వాత "యిది ఎలుగుబంటుది కూడాకాదు. ఎలుగుబంటి వెంట్రుక మొదట్లోగలకుసుగు బయటకురాదు. దీనికి మనదానికి మల్లేనే చివర తెల్లని కుసురువుంది పెద్దసైజులో...... నాకు తోచిందిది."

యిక చేసేదేంలేక సూపర్నెంటు "సర్జ! సర్టిఫికెట్ వ్రాసి పంపండి. యీ విషయం ఐ.జి. తో మాట్లాడుతాను" అనిలేచి, "సూర్యప్రభాక రావుగారూ! మీకిచ్చిన శ్రమకు క్షమించండి. అవుసరమున్నప్పుడు మిమ్ము కలుసుకొంటాను" అని షేక్ హాండ్ యిచ్చి శలవు తీసుకొని వెళ్లి పోయారు.

వీడ్కోలు మర్యాదలు పొందిన డాక్టరు సూర్యప్రభాకరరావు కూడా కారెక్కి వెళ్ళిపోయాడు.

లోపలివార్తలేం తెలియక పోయినా బయటి జనంలో బాగా నోపికవున్నవారు అలాగే నిలబడి వున్నారుయింకా,

వారంరోజులుగా గుంటూరు ప్రజలు 'గోరిల్లారాక్షసి' ని గురించి భయపడుతున్నారు. మొదట్లోయిది పత్రికాముఖంగా బయల్దేరి, యిద్దరు వ్యక్తులు నడిరోడ్డుమీద మరణించటంతో నగరంపూరా నమ్మింది. అగ్రహారం పోలీసుస్టేషన్ లో తాను గోరిల్లారాక్షసిని చూచానని రిపోర్టు యివ్వబోయిన ఒక యువకుణ్ణి, ఆ సబ్ యినస్పెక్టర్ హేళనచేసి 'పిచ్చాసు పత్రి' కి పంపుతానని బెదిరించాడు.

'ఎటునుంచి వస్తుంది? పగలేమవుతున్న' దని సంశయాన్ని వెలి బుచ్చిన ఒక ఉద్యోగికి ప్రక్కనే కాఫీతాగుతున్న ప్లీడరు, 'బహుశా దానికి రెక్కలుకూడా వుండవచ్చు' నని సమాధానము యిచ్చాడు హోటల్లో.

రెండో ఆట సినిమాకెళ్లి, సినిమా వదలిన గంటదాకా యింటికి రాని కొడుకుని 'గోరిల్లారాక్షసి తినివుంటుం'దని శోకాలు పెట్టిందో ముసలమ్మ.

## 2

## గోరిల్లా రాక్షసిని గురించి ప్రభుత్వ ప్రకటన

'ఇందుమూలముగా ప్రజలందరికీ–ముఖ్యముగా గుంటూరు ప్రజలకు–తెలియబర్చునది ఏమనగా, గతరాత్రి కొరిటెపాడురోడ్డుమీద జరిగిన హత్యను పురస్కరించుకొని, యింతకాలంగా ప్రజలు భయపడుతున్న 'గోరిల్లారాక్షసి' అనే అతిబలిష్టమైన విచిత్ర జంతువు గుంటూరు పట్టణ ప్రాంతాలలో తిరుగుతున్నట్లు భావింప బడుతోంది.

ఈ ప్రకటన వెలువడిన తర్వాత గుంటూరు ప్రజలు సాయంత్రం ఏడుగంటల తర్వాత ఎవ్వరూ యిల్లువిడచి బయట తిరగకూడదు. అన్ని రకాల హోటల్సు షాపులూ సినిమాహాలూ సాయంత్రం ఆరుగంటల తర్వాత తప్పనిసరిగా మూసివేయ కోరబడుచున్నవి. గుంటూరు వచ్చు బయటి వూళ్ల ప్రజలు పగటి పూటనే రావలయును.

యిందు విషయమై ప్రజలు గుమిగూడుటకాని పోలీసుల పహారా మొదలయిన పనులకు ఆటంకటము కలుగజేయుట కాని జరుప కూడదనీ, అట్టివారు కఠినముగా దండింప బడుదురనీ హెచ్చరిక.

గుంటూరు
తేది

(సం) ఓంకారాచారి,
యినస్పెక్టరు జనరల్ ఆఫ్ పోలీసు.

ప్రభుత్వప్రకటన ప్రజల్లోనిభయాన్ని రెచ్చగొట్టింది. దీనికితోడు రాత్రిళ్ళు ప్రతిరోడ్డూ, ప్రతిసందూ క్షణక్షణానికీ పోలీసుకార్లతో రొద పుడుతున్నయి. మంచికాంతివంతమైన ప్లాష్‌లైట్లుధరించిన ఆకార్లు ప్రతిరోడ్డునూ ప్రతిమూలనూ ప్రతిచెట్టునూ వెదుకుతున్నయి.

ప్రభుత్వప్రకటన వెలువడిన మరునాటికల్లా జనాభాలో మూడవవంతు ప్రజలు–భయస్థులూ–వీలున్నవారూ, వూరువిడిచి యితరవూళ్లకు వెళ్లిపోయారు. యితరచోట్ల పుట్టిళ్లువున్న ఆడవాళ్లు పిల్లల్ని భర్తల్ని

వెంటపెట్టుకొని వెళ్లారు. పోతే ఎటుపోవీలులేనివాళ్లూ, యిళ్లూ వాకిళ్లూ వదలిపోలేని పీనాశిధనవంతులూ ప్రభుత్వోద్యోగులూ తప్పనిసరిఆయి వుండి పోయారు.

వుండిపోయినవాళ్ళలో ప్రఖ్యాత పొగాకువ్యాపారి వెంకటప్పయ్య గారొకరు.

వెంకటప్పయ్యగారి 'ఇంద్రావాసన్నస్' కొత్తపేట చివరవున్నది. ఆ అందమయిన రెండతస్తులమేడలో ఆయనా ఆయనకోడలు ప్రమీలా యిద్దరు నెళస్తూవున్నారు. యాభయ్యోవడి ప్రవేశించినా వయస్సు ఆయన మీసాల్నీ జుట్టునీ గెడ్డాన్నీమాత్రమే తెల్లబడచేసిందికాని, జమీందారీఛాయలో పెరిగిన ఆయన శరీరదారుఢ్యాన్ని మాత్రం తగ్గించ లేక పోయింది. బారాటివిగ్రహం,విగ్రహానికి తగినబలం ఆయనకుండి కళ్లకు సహజత్వంగా వచ్చే చత్వారాన్నికూడా రానీకుండా చేసినయి.

లక్షాధికారిగాపుట్టిన వెంకటప్పయ్యగారు పెరిగి పెద్దవాడయి పొగాకువ్యాపారంలో యింకా లక్షలార్జించాడు. యిందుకు చాలదన్నట్లు బియ్యే. ప్యాసయిన కొడుకు జనార్ధనరావు కూడా యీ వ్యాపారంలోకే దిగి మద్రాసులో కొట్టుపెట్టి యింగ్లాడు అమెరికాలతో ఎగుమతివ్యాపారంచేసి రెండుచేతులా ధనం సంపాదిస్తున్నాడు.

డబ్బుకలవాళ్ళకే డబ్బుకూడుతుందన్నసామెత వీరింటికోడలు ప్రమీల మూడులక్షలు అధికారిణిగా రావటంతో ఖాయపడింది. ప్రమీల మేనరికం. మహారాణులకుండవలసిన సౌందర్యమూ సుగుణమూ ఆమెలోవుండి ఆ యింటికితగిన కోడలనిపించినయి.

వెంకటప్పయ్య ప్రభుత్వప్రకటన వెలువడనంతవరకూ యీ వుత్పాతాన్ని పుకారుగానే జమకట్టాడు. యివ్వాళ అదినిజమని తేలటంతో మద్రాసుకు, వెంటనేబయలు దేరిరమ్మని కొడుక్కు టెలిగ్రాంయిచ్చాడు. తెల్లారి కొడుకురాగానే భార్యా భర్తల్ని ఏబెజవాడో మద్రాసో వంపుదామని ఆయన వుద్దేశ్యం.

రాత్రి ఎనిమిదింటికల్లా అన్నిపనులూ పూర్తిచేయించి తలుపులన్ని స్వయంగాచూచివచ్చిన వెంకటప్పయ్య పదింటికి, రెండోసారి

తలుపులన్నీ చూచివచ్చి, మేడమీద కోడలుపడుకుంటే గది ప్రక్కగదిలో పడుకున్నాడు. నౌకర్లిద్దరూ ఒకరు హాల్లోనూ ఒకడు పైన వరండాలోనూ పడుకొని నిద్రపోతున్నారు.

గదిలో పడుకున్న ప్రమీలకు 'గోరిల్లారాక్షసి' నిజమని తెలిసినందువల్ల నిద్రపట్టటంలేదు. ఫ్రాంకీమంచంమీద పొర్లుతోంది. ఉత్తరపు వైపు కిటికీతీద్దామనుకొంది కాని భయంవల్ల వూరుకుంది. గదిమధ్యలో వెల్తుతున్న ఎనభయికాండిల్ మెర్క్యూరీబల్బు తెల్లగా వెలుగుతూ పందిరిపట్టిమంచాన్నీ, బీరువానీ, అక్కడ కిటికీదగ్గరవున్న కుర్చీనీ బల్లనీ స్పష్టంగా అగుపడేటట్లు చేస్తున్నది.

ఉత్తరపువేపున్న ఆరుబయలూ, చేలూ చలిగాల్ని విపరీతంగా ఎదుర్కొని ఒకవిధమయిన రొదపుట్టిస్తున్నాయి. ఆ గాలికి కిటికీతలుపులు తడవతడవకూ ఎవరోకొట్టినట్లే తటతటలాడుతున్నాయి.

తలుపుసందులోంచీ, కిటికీసందులోంచీ ఆ రాక్షసి ఎందుకురాకూడదాఅనే సందేహం ఏర్పడిందిప్రమీలకి. అయినా అట్లాఎందుకు వస్తుందిలే అనుకొని గట్టిగాకళ్లుమూసుకొని పడుకుంది.

లైటువెలుగుకారణంగా కళ్లుమూసుకున్న ప్రమీల మనోఫలకం మీద వెలుగుచీకట్ల మిశ్రమాల ఆకారాలేవో అగుపించటంతో కటిక్కినకళ్లు తెరచింది. మంచంక్రిందగా గోడలోవున్న నీటితూములోంచి చలిగాలి గొట్టంపెట్టి వూదినట్లూ, గోరిల్లారాక్షసి అందులోంచి చెయ్యిపెట్టి తనకోసం తముడుతున్నట్లూ అనిపించి వులిక్కిపడింది. ఆ తూముకు ఏదయినా అడ్డంపెడదామని లేచినప్రమీల, మూలమీద తననీడలో నిలబడ్డ ఆకారాన్ని చూచింది. లావాటితలకాయ గదిపైకప్పుకు తగులుతోంది. వెలక్కాయలంతగుడ్లు, జానెడుజానెడుకోరలు. ఏనుగుతొండాల్లాంటిచేతుల్ని వూపుకుంటూన్న గోరిల్లారాక్షసి ముందుకోఅడుగేసింది. కెవ్వున కేకేసినప్రమీల క్రిందపడిపోయింది.

మాగన్నుగా నిద్రపోతున్న ప్రక్కగదిలోని మామగారు ఉలిక్కిపడిలేచి తలుపుతీసుకొని కోడలుగదిదగ్గరకొచ్చి తలుపుకొట్టాడు. స్మృతి

లేకుండా పడిఉన్న ప్రమీల వలక్క పోయేసరికి గాబరాతో నౌకర్లను కేకేసాడు.

అప్పుడప్పుడే తెలివిలోకొస్తున్న ప్రమీలకు తలుపుతట్టేశబ్దం వికృతంగా వినిపిస్తోంది. ఆమెకుభయంతో వళ్ళంతా ముచ్చెమటలు పోశాయి. నెమ్మదిగా కళ్ళుతెరవప్రయత్నించి చూచింది. గోరిల్లారాక్షసి తనతలవైపున నిలబడి తలుపును అదేపనిగా బాదుతోంది అనే భయంతో అరవటంవల్ల మళ్లీ ఆవిడకు తెలివిదప్పింది.

తలుపులశబ్దం, ప్రమీలాలపెట్టినకేక ఆ సందులోకి లారీలో మలుపులిరుగుతున్న పోలీసువారికి వినబట్టంతో పోలీసుల ఫ్లాష్‌లైట్లు మేడమీదికీ, గదిబయట ఆందోళనపడుతున్న వెంకటప్పయ్యమీదికీ పనివాళ్ళమీదికీ ప్రసరించాయి. మేడముందుఆగిన లారీలోంచి ఒక బారాటి యినస్పెక్టరుదిగి, "ఏంజరిగిందయ్యా!" అనికేకవేశాడు.

లారీనిచూచి ముందు 'పోర్టికో' మీదకువచ్చిన వెంకటప్పయ్య ఆదుర్దాగా, "రండియినస్పెక్టరుగారూ! త్వరగారండి. మాకోడలుగదిలో ఏదోగలభా జరుగుతోంది-ఏదోప్రమాదం జరిగింది" అన్నాడు.

ఏడెనిమిదిమంది పోలీసులు తుపాకుల్తోసహా వెంటరాగా ప్రమీల గదిదగ్గరకువెళ్ళిన యినస్పెక్టరు తలుపుతట్టి చూచాడు. లోపల్నించి ఏ విధమైన జవాబురాకపోవటంతో నెమ్మదిగా చెవిపెట్టివిన్నాడు. ఏవో రకరకాల ఉశ్వాస నిశ్వాసాలు వినరావటంతో అతనికి అనుమానంజాస్తి అయి ప్రక్కనున్నవారిలో నలుగుర్ని 'రెడీ' అనిచెప్పి యిద్దర్ని తలుపుల ఊలకలెత్తమన్నాడు.

సిమెంటుస్లాబ్‌చేసిన బలిష్టమైనగోడల్లో బిగించబడ్డ ఆ తలుపులు పోలీసులకు సాధ్యం కాకపోవటంతో అతిసాహసికుడైన ఆ సార్జెంటు డాబా అంచుమీదనుంచి కిటికీవైపుగా నడిచాడు. అతిప్రకాశవంతమయిన లారీమీంచివచ్చే ఫ్లాష్‌లైటుకాంతిలో యింతసేపూవున్న ఆ సాహసికుని కండ్లు ముందువస్తు వేదైనదీ తెలుసుకోలేని స్థితిలోవుంటూన తడబడుతూ నడుస్తున్నాడు.

కుడిచేతిలో రివాల్వరు పుచ్చుకొని ఎడంచేత్తో గదిగోడను ఆధారంచేసుకొని వెలుగుచీకట్ల మిశ్రమమైన గుడ్డిమాపుతో కిటికీ చువ్వల్ని పట్టుకొన్న సార్జెంటు వెనక్కితిరిగిచూచాడు ఆ చీకట్లో.

అతిదూరానవున్న మంగళగిరికొండా, అక్కణ్ణించి నల్లగా ఎత్తుపల్లాలలో తలలూపుతున్న పైర్లూ, వరసగాచూస్తున్న అతనికళ్లు తాను నిలబడ్డ మేడక్రిందగా అగుపడుతున్న కందిచేలనుచూచాడు. మనిషెత్తున పెరిగి ఉత్తరపుగాలికి తలలూపుతున్న ఆ చెట్లమధ్యలో ఏదో నల్లని! ఆకారం వెలకాయలంతకళ్లను ఒకసారితెరిచి సార్జెంటుకోసం చెయ్యి చాచింది.

రాక్షసి కనుగ్రుడ్లు చూచిన సార్జెంటు భయంతో, "రాక్షసి! రాక్షసి" అంటూ కిటికీచేతిపట్టుతప్పి కందిచేలో పడిపోయాడు.

పోలీసులు హాహాకారాలతో గాలిలోకి తుపాకీకాల్పులు చేస్తూ మేడదిగి చేలోకి పరుగెత్తారు. కందిచెట్లమధ్య నుజ్జునుజ్జు అయిన జిల్లేడుచెట్టుమీద భోర్లాపడివున్న సార్జెంటును చేతులమీద పోలీసు లారీదగ్గరకు చేర్చారు.

యీ రగడ జరిగిన పదినిమిషాల్లోనూ తేరుకొని గదితలుపు తెరిచిన ప్రమీల విపరీతమైన తలనొప్పితోనూ గుండెనొప్పితోనూ బాధపడుతూ మామగారిచెయ్యి పుచ్చుకొని నెమ్మదిగా క్రిందిహాల్లోకి వచ్చింది. ఆమెగదిని పరిశీలించిన నౌకర్లు గదిలో ఏమీలేక పోవటంతో తలుపులు తాళంవేసి క్రిందహాలులో ప్రమీలకు పక్కఏర్పాటు చేసారు.

సార్జెంటును మోసుకొని పోతున్న పోలీసులారి వెంకటప్పయ్యగారి కోర్కెపైన యిద్దరు కానిస్టేబిల్సును అక్కడ వదలి గవర్నమెంటు హాస్పటల్ వేపుగా పోయింది.

వెంకటప్పయ్యగారు ఫోన్‌లో పిలవగా బయల్దేరి వచ్చిన ఆయింటి డాక్టరు మధుసూధనరావు ప్రమీలకు ప్రథమ చికిత్సచేసి ఉదయం వస్తానని చెప్పివెళ్ళాడు.

# 3

పూరికే భయపడి ప్రజలు అల్లాడిపోతున్న ఆరాత్రే యింకో సంఘటన కొరిటిపాడు రోడ్డుమీద జరిగింది.

రాత్రి పన్నెండు అయింది. కొరిటిపాడురోడ్డు చివర డ్యూటీ చేస్తున్న 705 కానిస్టేబిలు మురికాల్వ తూముమీద కూర్చొని వున్నాడు. అతనికి తోడుగావున్న తుపాకీని తూముకానించి నిలబెట్టాడు వడిలో లాఠీ పెట్టుకొని రోడ్డునూ రోడ్డుప్రక్క చెట్లనీ క్షణక్షణానికీ పరికిస్తున్నాడు.

ఆ అర్ధరాత్రిలో సిమెంటురోడ్డు తెల్లగా మెరుస్తోంది. రోడ్డు ప్రక్కనవున్న చింతచెట్లు వయస్సుమళ్ళినకారణంగా తమలోంచి ఎలక్ట్రిక్ దీపకాంతినిపోనిచ్చి రోడ్డుమీద రకరకాలబొమ్మల్ని సృష్టిస్తున్నాయి. ఎక్కువభాగం బురదతో నిండిన రోడ్డు ప్రక్కవున్న చెరువు కప్పల మ్రోతతో గింగురుమంటున్నది.

కానిస్టేబిలు పడమటి దిశగా రోడ్డుమీదకు చూచాడు. అర ఫర్లాంగు దూరంలో ఒక నల్లటి ఆకారం పెద్దతలకాయతో లావాటి శరీరంతో రాసాగింది. కూర్చున్న కానిస్టేబిలు గుండె ఝల్లుమన్నది. కాళ్ళు వణికినయి. వూద్దామని విజిలుతీసాడు. కాని చేతులు వణికినయి. విజిలు మ్రోతవిని వస్తున్న రాక్షసి ఎగిరి తనమీద పడితే ! ? నిశ్శబ్దంగా మురికాల్వలోకి దిగాడు తుపాకి సరిచేసుకొని.

ఆ వస్తున్నది రాక్షసికాదు. ఎవడోపల్లెటూరి రైతు. భార్యను ప్రమాదస్థితిలో హాస్పటలో చేర్చాడు. సాయంత్రం కాగానే బస్సులన్ని ఆగిపోవటంతో కాలినడకన గుంటూరుకు వస్తున్నాడు. దోవలో ఒకరిద్దరు అతనికి రాక్షసి సంగతి చెప్పారు కాని అతని మనస్సు ఆగ లేదు. చెవుల మీదుగా తలపాగా చుట్టుకొని నల్లని ముసుగు కప్పుకొని నడుస్తున్నాడు.

తన దగ్గరగా లైటు స్తంభాల వెలుగులో వచ్చేది మనిషే నని తెలుసుకున్న కానిస్టేబిలు ఆవ్యక్తి తూముమీదకు రాగానే సహజమైన అధికార స్వరంతో 'ఆగు' అన్నాడు లేస్తూ.

ఏదో తూముప్రక్కనించి రావటాన్ని హఠాత్తుగా చూచిన ఆ రైతు చేతిలోని ముల్లుకర్రను అమాంతం పైకెత్తి ఎదురు తిరిగాడు.

"ఎవరునువ్వు" వెలుగులోకి వచ్చిన పోలీసు ప్రశ్నించాడు.

"ఏం!"

"రాత్రిళ్ళు నడవకూడదని తెలియదూ?"

పోలీసును గుర్తించిన రైతు స్వరం తగ్గించి, "కాదు బాబయ్యా, యింటేది హాస్పటల్లో కంటానికి చేరింది. ఎలాగుందో చూద్దామని పోతుండా. దయయుంచండి బాబూ! నన్ను పోనివ్వండి" అన్నాడు.

"యీ వూళ్ళో గోరిల్లా రాక్షసి తిరుగుతోంది. ఎవ్వరూ తిరగ కూడదు"

"చిత్తం. యింకెప్పుడూ రానులెండి" అంటూ రెండడుగులు వేశాడు.

భార్యా విషయకంగా బ్రతిమాలుతున్న ఆ రైతును వారించ లేక మౌనం వహించాడు కానిస్టేబిలు.

రైతు తన నడకను వడిచేసాడు. మళ్ళీ ఏపోలీసుఅయినా ఎదురు పడి తనను అటకాయిస్తాడేమో అని అతను భయపడ్డాడు. తాలూకా ఆఫీసు దాటింతర్వాత పెద్దరోడ్డుమీద ఎందుకు పోవాలని పించిందాతనికి -మలుపు తిరిగి బ్రాడీపేట సందులోకి ప్రవేశించి త్వరత్వరగా నడవ సాగాడు.

ఆ అర్థరాత్రి యీదురుగాలికి బజార్లో కుక్కలు కూడా తగిన వెచ్చని స్థలాలు వెతుక్కొని నిద్రపోతున్నయి. చేతిలోముల్లుకర్రను వూపుకుంటూ నడుస్తున్న రైతునీడ, ముందులైట్ల వెలుగులో వెనక్కి పెరిగీ,లైట్లు దాటటంతోనే ముందుకుపెరిగీ క్రమతను ఏర్పరచుకుంటోంది. ఎదట సందు మలుపులో ఏదో కదలినట్లయి ఠక్కున ఆగిపొయ్యాడు ఆపల్లెవాసి. ఏంలేదనుకొని మనస్సు కుదుటపరచ్చుకొన్న అతను రెండడు గులు వెయ్యగానే ఒకనల్లని బారాంటి విగ్రహం మునిపల్ చెత్తతొట్టి

ప్రక్కగా లేచి నుంచుంది. రైతు శిలాప్రతిమ అయి నిలబడిపొయ్యాడు., భ్రమ ఏమోనని కళ్ళునులుపుకొని మరీ చూచాడు. జడలు కట్టిన తల వెంట్రుకలు గుబురుగా ముఖాన్ని కప్పి ఆవిగ్రహం యొక్క వెడల్పయిన నల్లని ఛాతీమీద పడుతున్నాయి. పొడుగాటి చేతులమీద నల్లనికండలు అతికినట్లున్నాయి. ఎలుగుబంటి వంటిమీద లాగే నల్లని బొచ్చు ఆ విగ్రహం శరీరంనిండా అలముకొనివుంది. పొడుగాటి గోళ్ళుగల చేతులను తలపైకెత్తి నోరుతెరచిన విగ్రహం, "హుం.!" అంటూహుంకరించి కాలెత్తి ఒకఅడుగు ముందు కేసింది. చిన్న చేటంతవున్న ఆ పొడుగాటి తెల్లనిపాదాన్ని స్పష్టంగా చూచిన రైతు అరుద్దామని ప్రయత్నించాడు కాని నోరు పెగల్లేదు. పరిగెత్తి పారిపోదామని కాలెత్తాడు కానిరెండో కాలు వణికి పోటంతో కూలబడ్డాడు. గోరిల్లారాక్షసి ఊగుకుంటూ వేస్తున్న ఒక్కొక్క అడుక్కూ ఆఅభాగ్య రైతు ఒక్కొక్క ప్రాణమే పోసాగింది. అతని దగ్గరకు వచ్చిన ఆరాక్షసి అతని పొట్టమీద కాలేసింది. అబ్బా! ఆబరువుకు క్రింద వానిపేగులూ ఎముకలూ పిండిపిండి అయి నేలను కరుచుకొన్నాయి. క్రమేణా వంగిన ఆవిగ్రహం రైతుకుడి కాలు పుచ్చుకొని పైకి ఎత్తింది. కానిఆకాలు దానికి సరిగ్గా అందకజారి పోటంతో కోపంవచ్చినట్లున్నది. తెల్లనికోరల్నీ పళ్ళనీ యికిలించి వంగి మళ్ళకాలును లంకించుకొని బలంకొద్దీ లాగింది. చెరకుముక్కలా తొడ వరుకూ వూడివచ్చిన ఆకాలును వాసనచూచి అవతల పారేసిందా రాక్షసి. చనిపోయిన రైతుముఖంమీదకు తనకాలునిపోనిచ్చి అప్పడాల కర్రలా అదిమి చాదింది. యింతలో ఎక్కడో లారీశబ్దం వినబడటంతోనే వెనక్కితిరిగి ఎగురుకుంటూ ఎగురుకుంటూ నడిచే భంగిమలో అనంతచీకట్లో లీనమయి పోయిందా ఆసలైన గోరిల్లారాక్షసి.

తెల్లవారిందాకా ఆ శవంలో కొంతభాగాన్ని, తగవులాడుకుంటూ ఫలహారంచేసినయి ఆ ప్రాంతలోని బజారుకుక్కలు. అక్కడి రక్తమ్మడుగుతో పోటీపడుతూ అరుణ సూర్యకిరణా లుదయించాయి.

జనం వచ్చేదాకా ఆ శవంచుట్టూ కాకులూ గద్దలూ మూగి జనంరాగానే తప్పుకున్నాయి. ఏడుగంటలకు పోలీసులారీలు రావటం

తోనే జనం తప్పుకున్నారు. కాకిమూకలాంటి జనం ఏ విధమైన కాలి ముద్రలూ మిగల్చకుండా త్రొక్కిడి చేసినందుకు విసుక్కొని తిట్టు కొన్నాడు స్పెషల్ C.I.D సర్కిలు కేశవరావు. కుక్కలు తినగా, గ్రద్దలు పీకగా మిగిలిన ఆ అభాగ్య శవాన్ని జాగ్రత్తగా లారీలో కెక్కించుకొని వెళ్లారు పోలీసులు.

యీవిడ్డూరానికి వివిధ చమత్కృతులు జోడించి చెప్పుకుంటూన్న రోగులూ, మందుకొచ్చినవారూ గోడగడియారం ఎనిమిది కొట్టటంతో డాక్టరు సూర్యప్రభాకరరావు మేడలో హాల్లోకూర్చున్న జనం నిశ్శబ్దత వహించారు ఆయని వచ్చేవేళ అయినందువల్ల.

డాక్టరు సూర్యప్రభాకరరావు బ్రాడీపేట పదకొండో లైనులో పదహారో అడ్డరోడ్డులో పొలాలలో మేడకట్టి హాస్పటలు పెట్టాడు. ఆయన పదిహేనేళ్ళపాటు యింగ్లాండు అమెరికాలలో వైద్యవిద్య నభ్య శించి పెద్దపెద్ద బిరుదుల్ని పొందివున్నాడు. 'మానవకోటిలో జంతు లక్షణాలు' అనే విషయంమీద పెద్ద రీసెర్చిజేసి ప్రపంచంలో అఖండఖ్యాతి సంపాదించి ప్రపంచ వైద్యసంస్థచేత మన్ననలు పొందాడు. భారత ప్రభుత్వం ఎన్నిసార్లో రకరకాల ఆధిపత్యాల్నిచ్చి నప్పటికీ వాటిని సరకు చేయకుండా ప్రజాసేవనూ, స్వతంత్ర జీవనాన్నీ పాటించి గుంటూరులో వుంటున్నాడు. ఆయన్ది పల్నాటి సీమ. మున్నబుగిరిలో వున్న తండ్రి శ్రద్ధగా చదువు చెప్పించి యితని తెలివితేటల కనుగుణ్యంగా ఆస్తినంతా అమ్మి సీమకు పంపి ఏడేళ్ళక్రితం అంటే సరిగ్గా యీయన చదువు పూర్తి అయిన సంవత్సరమే పరమపదించాడు. తండ్రి మరణవార్తకు ఎంతగానో కుమిలిన డాక్టరు స్వదేశానికి రాప్రయత్నించాడు కాని అమెరికా ప్రయాణ మనివార్యమవటంతో అటు వెళ్ళాడు.

సూర్యప్రభాకరరావు నిగర్వి, చూపరి, ముప్పయి అయిదేళ్ళ ప్రాయంలోనూ అతను పాతికేళ్ళవాడంటే అంతానమ్ముతారు. చక్కటి పొట్టిక్రాపూ, నున్నటిగుండ్రటిముఖం, అయిదడుగుల అరంగుళాలఎత్తూ, ఎత్తుకుతగ్గలావూ, శరీరపు మేలిమి బంగారుఛాయా అతనిలో ఉత్తమ పురుషలక్షణాల్ని ఏర్పరిచాయి.

పైఅంతస్థులో కాపురమున్న ఆయనహాస్పటలులోకి రావటానికి మెట్లుదిగుతున్నాడు. పొడుగాటిబ్రౌజరు వేసుకొని సన్ననిచొక్కాను 'యిన్‌షర్టు'చేసి ఒకచేత్తో 'స్టెతస్కోపు' పుచ్చుకొని కిందహాల్లోకి వచ్చాడు.

డాక్టరుగార్ని చూడగానే హాల్లోవున్నవాళ్ళంతా లేచినుంచొని నమస్కారాలు చేసారు. అందిర్నీ సానుభూతిగాచూస్తూ సూర్యప్రభాకర రావు తనప్రవేట్ గదిలోకివెళ్ళి అక్కడే కుర్చీలోకూర్చున్న C. I.D సర్కిలు కేశవరావు చేసిన నమస్కారానికి ప్రతినమస్కారంచేసి 'హలో యినస్పెక్టర్!' అన్నాడు.

C.I.D సర్కిలు, "యీబజారుచివర, రాత్రియింకోహత్య జరిగిందండి! చాలా ఆశ్చర్యంగావుంది"

డాక్టరు, "గోరిల్లారాక్షసే చేసిందా?...... ఏవిధంగా జరిగింది" అన్నాడు కూర్చుంటూ,

"అదేనండి... వాడెవడో పల్లెటూరిరైతులాగున్నాడు....... రాత్రి ఒంటిగంటా ఆప్రాంతలో గోరిల్లారాక్షసికి ఎదురుపడి వుంటాడు... కిందపడేసి కుడికాలు శరీరంలోంచి బలవంతంగాలాగి అవతల పారేశింది.. మొఖంమీద కాలేసిత్రొక్కిశవం ఎవరిదయిందీ గుర్తులేకుండా చేసేసింది.. యిట్లావుండగా పదిన్నరా ఆప్రాంతాల పొగాకువ్యాపారస్తుడు వెంకటప్పయ్యగారు లేడూ——"

"ఆఁ. ఆఁ. కొత్తపేటచివర.... ఆయనకేమయిందేం?"

"ఆయన కోడలుప్రమీల గదిలో రాక్షసిరూపం అగుపించటంతో భయపడి మూర్ఛపోయింది. యీగలాభానుజూచి సాయంచేయబోయిన ఓ యినస్పెక్టరు కందిచేలో జిల్లేడుచెట్టును రాక్షసిగాభ్రమించి, అక్కడి నించి పడి చెయ్యివిరక్కొట్టుకున్నాడు. యిదంతాచూస్తే నాకేదో 'యిది' గావుందండి"

"నాకూడా ఏమీ అర్థంకావటంలేదు...యిప్పుడు నాతో మీకేమయినా పనివుందా?"

"అక్కో ఏం లేదండీ...... జంతుశాస్త్రంలో మీరు ఆమేయంగా కృషి చేసి వున్నారు కదూ! యిందువిషయమై ఏమైనాసలహా నిస్తారేమో నని యిటువచ్చాను..... మీ హాస్పిటల్ కార్యక్రమం కానీండి...నావల్ల మీకేమీ శ్రమకలుగదు" అన్నాడు కేశవరావు బల్లమీది పత్రికను చేతిలోకి తీసుకొంటూ.

"థ్యాంక్స్. పేపరుచూస్తుండండి. యింతలో నేను నా పేషంట్సును చూస్తాను" అని డాక్టర్, "రాజేశ్వరరావు!" అని పిలిచాడు.

పెద్దకాంపౌండరు రాజేశ్వరరావు ప్రక్కగదిలొంచివచ్చి గుమ్మం ముందు నిలబడ్డాడు.

"ఎరికలవాడి టెంపరేచర్ చూచావా? యిటురమ్మనమను"

"103 వుందిసార్!" అనేసి వెళ్ళిపోయిన రాజేశ్వరరావు ఒకనిమిషం అనంతరం, పెద్దజుట్టూ మోకాళ్లుదాటని పంచెతో మీసాలూ గెడ్డాలూ పెంచుకొన్న ఒకనడివయస్కుడితో లోపలికివచ్చాడు.

వచ్చినవ్యక్తిని చూచేటప్పటికి కుర్చీలోకూర్చున్న కేశవరావుకు అసహ్యం, ఆశ్చర్యం వేసింది. పేపరు చదువుతున్న వాడల్లా నోట్లో సిగరెట్టును అలాగేవుంచుకొని ఒకమూలగా నిలబడ్డ ఆవ్యక్తిని తదేకదీక్షతో చూచాడు.

దాదాపు ఏడడుగుల బారూ, మూరెడుజుట్టూ, కండలుదిరిగిన బుజాలూ, సింహం పంజాల్లాంటి చేతులూ— "యితని కేంజబ్బో?" అనుకున్నాడు.

కాంపౌండరు మందుసీసా, నాలుగుపొట్లాలు వాడికిచ్చిన తర్వాత ఆ వ్యక్తి, దణ్ణంపెట్టి పోవటంచూచిన కేశవరావు యేదో అనుమానంతో ముఖం చిట్లించి డాక్టరు దగ్గర శలవు తీసుకొని వెళ్లిపోయాడు.

## 4

వెంకటప్పయ్యగారి మేడముందు డాక్టరు మధుసూధనరావుగారి గుర్రబ్బండీ ఆగివుంది. హాల్లో ఒక ప్రక్కగా మంచంమీద ప్రమీల పడుకొనివుంది. రాత్రి భయపడ్డ దగ్గర్నుంచీ రెండు రోజులుగాపట్టు

కొన్న జ్వరం ఒక డిగ్రీకూడా తగ్గక పోవటంతో ప్రక్క కుర్చీలో కూర్చున్న డాక్టరూ, ఆమె మంచంమీద కూర్చున్న భర్త జనార్ధన రావూ, ఉయ్యాల బల్లమీద కూర్చున్న వెంకటప్పయ్యా ఆలోచనలతో మౌనం వహించారు.

చాలా నీరసంగా మూలుగుతూ కళ్ళు మూసుకొని వత్తిగిలి పడుకున్న ప్రమీల మగవారి ఎదట అలాపడుకున్నందుకు కించపడుతూ తనసహజ సౌందర్యాన్ని వీలయినంతగా గుడ్డతో కప్పుకొని అగుపడకుండా చేస్తున్నది.

“జ్వరం తగ్గకపోవటం......మధ్యమధ్య కలవరించటం... ఏమిటంటారు?” జనార్ధరావు డాక్టర్ని ప్రశ్నించాడు.

మధుసూధనరావు ఆయింటి డాక్టరు. తనఅనుభవంలో ఆయనకిదే మొదటిగడ్డుకేసు. వున్నకుటుంబప్రాపకం నిలబెట్టుకోటానికి అయనీ రెండురోజుల్నించి రకరకాలమందులు వుపయోగించి చూచాడు. జ్వరం తగ్గలేదు.

“ఆ అమ్మాయిలో ఏర్పడ్డభయం మందును నిష్ప్రయోజనం చేస్తున్నది....బహుశా తెల్లారేటప్పటికి జ్వరంతగ్గుతుంది.” అన్నాడు జనార్ధనరావు ప్రశ్నకు సమాధానంగా—

పనివాడువచ్చి స్విచ్చివేసి లైట్లు వెలిగించటంతో డాక్టరుచేతివాచీని చూచుకొని లేచాడు. వాకిటిలోనుంచున్న బండివాడొచ్చి డాక్టరు బ్యాగ్‌ను తీసుకొని బండిదగ్గరకు వెళ్ళాడు. డాక్టర్ని సాగనంపటానికి బయటకువచ్చిన తండ్రీకొడుకులు ఆయనకు నమస్కారంచేసి లోపలికి వెళ్ళారు.

రాత్రి పదిగంటలదాకా భార్యమంచంమీద కూర్చున్న జనార్ధన రావు హాల్లో ట్రాన్స్‌ఫారంబల్బును వెలిగించి పెద్దదాన్ని ఆర్పేసి భార్య మంచం దగ్గరగా తనమంచాన్ని లాక్కొని పడుకున్నాడు.

అంత అమావాశ్య చీకట్లోనూ, వెంకటప్పయ్యగారి పలుకుబడి కారణంగానూ, జీతాల కాశపడీ చట్టబద్ధులై కాపలా కాస్తున్న యిద్దరు

పోలీసులూ సేటుబయట పహరా తిరుగుతున్నారు. పిల్లాపెల్లాను వదిలి పెట్టి యీ చలిలో యిల్లా అవస్థపడటానికి కారణభూతమైన గోరిల్లా రాక్షసిని నోటికొచ్చినట్లల్లా బండబూతులు తిట్టుకుంటూ. ఒకర్నొకరు పలకరించుకొని ధైర్యం చెప్పుకుంటున్నారు.

మంచంమీద పడుకున్న జనార్ధనరావుకు నిద్రపట్టటం లేదు. విజయ వాడా, సత్యనారాయణపురం, తన మేనత్తగారి యిల్లూ, అందులో కుర్చీలో కూర్చున్న తన విధవమేనత్తా అప్పుడే గుమ్మంలో అడుగు పెట్టినతనూ మాగన్నుగా అగుపించటం మొదలుపెట్టి క్రమేణా ఖాయి పడ్డాయి.

"రా నాయన రా! యిదేనా రావటం?" అన్నది మేనత్త.

"అవునత్తయ్యా!" అంటూ తాను లోపలికి వెళ్లాడు జనార్ధన రావు.

"గోపాలంకూడా యిక్కడే వున్నాడు... మొన్న వచ్చాడు"

"ఆఁ హాఁ, ఎక్కడున్నాడు." అంటూ కుర్చీలో కూర్చున్నాడు.

"వాడూ ప్రమీలా బజారెళ్ళారు టపాకాయలకోసం... అమ్మా నాన్నా బాగున్నారా... ఏ బండి కొచ్చావు"

"ఆఁ అంతా బాగానే వున్నారు. యీ మూడుగంటల బండికి వచ్చాను" అని సమాధానం చెప్తున్నాడేకాని తన పెదనాన్న కొడుకు గోపాలం తనకంటే ముందే వచ్చినందుకు లోలోపల యీర్ష్య పడు తున్నాడు జనార్ధనరావు.

ఇంతలో బయట రిక్షాలోంచి ప్రమీలా గోపాలరావులు దిగి లోపలికి వచ్చారు.

"ఏరోయ్! జనీ! ఎప్పుడు రావటం!" గోపాలం ప్రశ్నించాడు. గోపాలానికి యిరవై ఏళ్లుంటాయి. ఆ సంవత్సరమే బియ్యే ప్యాసయి ఇంగ్లాండు పోవటానికి సన్నాహాల్లో వున్నాడు. జనార్ధనరావు గోపాలం కంటె ఒక సంవత్సరం చిన్న. ఇంటర్మీడియట్ రెండుపార్టులు తప్పి కూర్చున్నాడు. యీ మేనత్తకున్న ఆస్తితోపాటు అందమయిన ప్రమీ

లని పెండ్లాడాలని యిద్దరూ తమ తండ్రులతోపాటు సమంగా తాపత్రయ పడుతున్నారు. మేనత్త వెంకటలక్ష్మమ్మకు కూడా ఏ అన్ననీ కాదన లేకా, పదిహేడేళ్ళ ప్రమీలను యికమీదట యింట్లో వుంచుకోటం భావ్యంకాకపోవటానా మధనపడుతున్నది.

పోతే ప్రమీలమాత్రం పెద్దబావ గోపాలాన్నే మనస్సులో గాఢంగా ప్రేమించివుంది. పైకంటే బంధుత్వంలో పొరపొచ్చాలు వస్తాయనీ అంతగా అవసరమైతే చెప్పేద్దామనీ ముభావనగా వూరుకుంది. దీపావళి పండక్కు వచ్చిన జనార్ధనరావుని చూడగానే 'యీ యిద్దర్నీ సమా ధానపర్చట మెట్లాగా' అని ఆలోచిస్తూ యింట్లోకి వెళ్ళిపోయింది ఆమె.

జనార్ధనరావు జ్ఞాపకాలు మరునాటి మధ్యాహ్నం జరిగిన సంఘ టనల్లోకి ప్రవేశించాయి.

భోజనాలయింతర్వాత అంతా హాల్లో తీరుబడిగా కూర్చున్నారు. తానే ప్రమీల పెండ్లి విషయం ఎత్తుదామనుకుంటున్నాడు. యింతలో గోపాలమే ముందు మాట్లాడాడు.

"నేను యింగ్లాండు వెళ్ళి వచ్చింతర్వాతనే ప్రమీలను పెళ్ళాడ తాను. మీరు యీలోపల తొందర పెట్టకండి అత్తయ్యా?" అన్నాడు.

"తొందరేంవుంది నాయనా!...మరి నాన్న ఏమంటాడో!" సంది గ్ధంగా అన్నది వెంకటలక్ష్మమ్మ.

"నాన్నకూడా యీవిషయమే హెచ్చరించ మన్నాడు" జనార్ధన రావు తానూ వున్నానన్నట్లు-అన్నాడు.

"ఏమో బాబు...ఏం జెయ్యాలో తోచటంలేదు...అయినా యిప్పుడెందుకులే ఆ గొడవ" అంది ఆవిడ.

"దీంట్లో చేసేదేముంది...ప్రమీలను అడగండి...ఎవర్ని చేసు కుంటానంటే వాళ్ళకే యిచ్చి చేసేయి...తగాదాయేవుండదు" అన్నాడు గోపాలం.

బాధ్యతా తీర్పు ప్రమీలమీదకు పోవటంతో జనార్ధనరావుకు సంశయం ఏర్పడింది. బహుశా ప్రమీల గోపాలాన్ని బలపరుస్తుందేమో

నని భయపడి విషయాన్ని మార్చాడు. పండక్కి వుండకుండానే బయలుదేరివచ్చాడు.

ప్రమీలతో పెండ్లి అయిననాడు మొదటిరాత్రి—

“గోపాలం బ్రతికుంటే నన్ను పెండ్లాడేదానివేనా ?” గోముగా ప్రశ్నించాడు జనార్ధనరావు.

“యిప్పుడెందుకా విషయం ? పోనిద్దురూ !” బెట్టుగా అంది ప్రమీల, తాను క్రిందవేసుకొని పడుకున్న చాపని అంటిపెట్టుకొని పడుకొని_ముడుచుకొని పడుకొన్న ఆమెబుజాన్ని తట్టుతూ జనార్ధనరావు,

“యిది మోసం!...ప్రమీలా” అన్నాడు దీనంగా.

“అయితే...నా గదిలోకి వెళ్ళి పడుకుంటా” అన్నది ప్రమీల కటువుగా.

ఆ గదిలోంచి ప్రమీల వెళ్ళిపోతే, ఆ యింట్లోవున్న బంధువుల్లో స్నేహితుల్లో తనకెంత నామోషిగా వుంటుందో జనార్ధనరావు ఆలోచించుకొన్నాడు. మూడులక్షల కధికారిణిగానూ మేనరికంరూపేణా చనువూ సామర్ధ్యాలున్న ప్రమీలను తానెంతవరకు వంచగలడో కూడా ఎరిగున్న జనార్ధనరావు, వంశమర్యాదా, సాటివారిలో తమలోకువా అర్ధంచేసుకొని వెళ్ళి మంచంమీద పడుకున్నాడు.

పడుకున్న ప్రమీలకు జనార్దనరావు గోపాలం విషయం ఎత్తటంతో మనస్సు వికలమయింది. చనిపోయిన గోపాలానికి తానేదో మహాపరాధం చేస్తున్నట్లూ, ‘వద్దు...తప్పు’ అని గోపాలం తనని హెచ్చరిస్తున్నట్లూ తోచింది. తన ఆత్మీయుల్ని చంపి తనని చెరపట్టిన రాక్షసుడుగా జనార్ధనరావు ఆమె మనస్సులో హత్తుకపొయ్యాడు. అశేష ధనసంపదల కారణంగా పెద్ద పలుకుబడి సంపాదించే కొందరు ధనికులకు మల్లేనే ఆ కుటుంబం ఒకరికొకరికి పొత్తులేకుండా వుంది.

కొడుకూ కోడలూ వున్నరీతిని పసికట్ట గలిగిన ముసలాయన తన కేమీ పట్టనట్లుగా నటించసాగాడు.

ఎదటి సిద్దాన్నాన్ని తిన వీలుకాని నోరుగల పక్షవాతరోగిలా తనలో తాను ఆవేదనతో దహించుకపోసాగాడు జనార్ధనరావు.

ఈ కుటుంబాన్ని వర్జించలేకా ఆమోదించలేకా నిస్సహాయ స్థితిలో మూడేండ్లు గడిపింది ప్రమీల.

జగన్మోహినిలాంటి భార్య; తన కలివిడికాకుండా పైపెచ్చు నిత్య నూతనంగా అలంకరించుకొని తనని ఊరిస్తున్న ప్రమీలను చూట్టమే దుర్భరమై జనార్ధనరావు మనశ్శాంతికై మద్రాసువెళ్ళి అక్కడ బ్రాంచి పెట్టి వ్యాపారంలో దిగాడు.

* * * * *

బయట చలిగాలి వుధృతంగా వీస్తోంది, మరీ పూరుబయట అవటంతో ప్రక్కనున్న కందిచేలు ఏపుగాపెరిగి పూలుపూచి అవిరామంగా గాలికి వూగుతున్నయి. అప్పటిదాకా నిలబడ్డ పోలీసులు కొంతసేపయినా విశ్రాంతి తీసుకుందామని గేటుకానుకొని కూర్చున్నారు. ఎక్కడా చీమకదలిన అలికిడిలేదు.

కందిచేలో టెలిగ్రాఫ్ స్థంభాన్ని ఆసరా చేసుకొని నిలబడ్డ గోరిల్లారాక్షసి తడిగావున్న నేలమీద ఒకడుగు ముందుకేసి వెంకటప్పయ్యగారి మేడకేసి చూచింది. ఆ చీకట్లోవున్న కొద్దిలైట్ల వెలుక్కి తెల్లగా మెరిసిపోతోంది ఆమేడ. కొంచెం వంగి బారాటి చేతుల్ని వూపుకుంటూ చుట్టూతా జాగ్రత్తగా చూచుకుంటూ, ఒక్కొక్క అడుగే వేసి ఉత్తరపు గోడదగ్గరకు చేరిందా రాక్షసి.

గేటుకానుకొనికూర్చున్న పోలీసుకు ఒకకునుకు వచ్చింది కాబోలు ప్రక్కకు వరిగి రెండోవాడిమీద పడ్డాడు. రెండోవాడు ఉలిక్కిపడి తోటివాణ్ణి లేపి,

“భయపడి చచ్చానుకదరా! నీ నిద్ర పాడుకాను” అన్నాడు.

“ఏమిటయ్యా యీ భజన......శుభ్రంగా స్టేషన్లోనో యింట్లోనో వుండాల్సిన మనకీ గతేంటి?” అని విసుక్కొని పడిపోయిన టోపీని తీసిపెట్టుకొని నిలబడ్డాడు మొదటివాడు.

మనుష్యుల అలికిడిని పసిగట్టిన గోరిల్లారాక్షసి కంది చేలోకి పోయి నేలకానుకొని పడుకొంది. ఎవ్వరూ ఎంతసేపటికీ రాకపోవటంతో

అలాగే పాకుకుంటూ పదిగజాలు ముందుకొచ్చి చేలోంచే లేచి గేటు దగ్గర తిరుగుతున్న యిద్దరు పోలీసుల్నీ వాళ్ళచేతుల్లోని తుపాకుల్నీ చూచి పళ్ళికిలించింది.

ఎంతసేపటికీ ఏమీరాజరక్క పోవటంతో విసుగెత్తిపోయిన ఆ పోలీసులు జేబులో చుట్టలుతీసి నోట్లోపెట్టుకొని ఒకడు గాలికి అడ్డం నిలబడగా రెండోవాడు అగ్గిపుల్లగీసాడు.

ఈ అదను కనిపెట్టిన రాక్షసి పిల్లిలా వీళ్ళదగ్గరికి పాకుతోంది.. రెండగ్గిపుల్లలూ వెలిగి ఆరిపోయిన కారణంగా బహుజాగ్రత్తతో యింకొంచెంవంగి మూడోపుల్లను వెలిగించ ప్రయత్నిస్తున్న ఆ యిద్దరి వెనగ్గా పిశాచికిమల్లె గోరిల్లారాక్షసి చేతులు పైకెత్తుకొని నిలబడింది.

అగ్గిపుల్లగీస్తున్న పోలీసు ఎందుకో తలఅటుతిప్పి ఆ బ్రహ్మాండమయిన విగ్రహాన్ని చూచి "బ.....బ.... బా" అని నోరు తెరిచాడు. 'ఏమిటిరా!' అనబోయిన రెండోవాడి తలమీద పిడుగులా రాక్షసిచెయ్యి పడి తల మెడలోకి దూసుకపోయింది. మొదటిచెత్తోపాటే రెండోచెయ్యి రెండోవాడి గొంతుకోసం చాచింది కాని అతడు కొంచెం వంగటంవల్ల పట్టుదొరకలేదు. కొంచెం ముందుకువంగి రెండోవాడి పొట్టలోకి రెండు చేతులూ పోనిచ్చి అతన్ని పైకెత్తి గిరాగిరాతిప్పి గిరాటువేసింది. గాలిలో గిరగిరా తిరుగుతూ పెద్దమూటలా ఆ మేడవరండాలో తపక్కున పడ్డాడు నిర్జీవిగా విసిరివేయబడ్డ పోలీసు.

వరండాలో ఏర్పడ్డశబ్దం కలతనిద్దరపోతున్న జనార్థనరావును మేలుకొలిపింది. అలికిడికోసం కళ్ళుతెరిచి నిరీక్షిస్తున్న అతనికి బయటగేటును అదేపనిగా ఎవరో వూపుతున్న శబ్దం వినవచ్చింది. నెమ్మదిగా లేచి తనగదిలోకివెళ్ళి రివాల్వరు తీసుకొని మళ్ళీ మంచం దగ్గరకొచ్చి కూర్చున్నాడు అతను క్షణంలో.

బయటగేటు వూగుతున్న శబ్దం ఎంతకీ ఆగకపోటంతో ప్రమీల మంచం మీదగావంగి కిటికీతలుపు కొంచెంగాతీసి చూచాడు జనార్ధనరావు.

పూలచెట్లమీదగా వెడల్పాంటి యినపగేటును ఎక్కటానికి ప్రయత్నిస్తూ వీలుకాకపోవడంతో దాన్ని తనభుజబలంతో సాధిస్తున్న నల్లటి భారాంటి రాక్షసిని చూచాడతడు.

కిటికీ తలుపులుమూసి ఎవర్నీ లేపకుండానే మేడపైకెక్కిన జనార్ధనరావు 'పోర్టికో' పిట్టగోడదగ్గరకూచొని కొంచెం తలపైకెత్తి ఆ రాక్షసి కృత్యాల్ని చూస్తున్నాడు.

అసలే కలవరమైన మనస్సుతో నిద్రపట్టీపట్టక మేడమీద పడు కొన్న వెంకటప్పయ్యగారు గేటుచప్పుడూ, మేడమీది అడుగులచప్పుడూ విని పిల్లిలా అడుగులేసుకుంటూ తలుపుతీసి కొడుకు దగ్గరికివచ్చి, తదే కంగా రాక్షసినే చూస్తున్న కొడుకుబుజంమీద చెయ్యేసాడు.

ఏదోమీదపడ్డదని అదిరిపడ్డ జనార్ధనరావు చేతిలో రివాల్వరు అప్రయత్నంగా పేలింది. అదృష్టవశాత్తూ ఆ దెబ్బకొద్దిలో ముసలా యన్ని తప్పుకపోయింది.

తుపాకీశబ్దంవిన్న రాక్షసి తనప్రయత్నాన్ని మానుకొని నాల్గు అంగల్లో కందిచేలోకి దూరింది.

"పూరుకో! కాల్చకు" అని తండ్రి తనచేతిని పట్టుకోటంతో నిల బడి రాక్షసిమీదకు గురిచూస్తున్న జనార్ధనరావు పూరుకొన్నాడు తుపాకి శబ్దానికి మేలుకున్న నౌకర్లు మేడమీదకు పరిగెత్తారు. తుపాకి శబ్దానికి కలవరపడిలేచిన పక్కమేడలవాళ్ళు మాత్రం లైట్లువేసి కిటికీ ల్లోంచి చూశారు.

కొడుకుతోసహా మేడదిగివచ్చిన వెంకటప్పయ్య వీధివాకిలి తెరిచి వరండాలో చేతులూ కాళ్ళూ బారజాచుకొని పడివున్న రక్తముద్ద అయిన పోలీసునుచూచి గబగబా పోలీసులకుఫోన్ చేశాడు.

అయిదు నిమిషాల అనంతరం రెండు లారీలనిండా, మందీమార్బ లంతో వచ్చిన సూపర్నెంటు గోపాలరావునాయుడూ, C. I. D సర్కిలు కేశవరావూ యీ ఘోరాన్నిచూచి విస్తుపోయారు.

ఏనుగులకుకూడా అలివికానంత బలిష్టంగా తాతా కంపెనీవారు తయారించిన ఆగేట్లు కొన్నిచువ్వలు వంగిపోయి గేటు పిడచలున్న చోట గోడపగిలిపోయి కేశవరావును ఆశ్చర్య పరిచాయి.

పోలీసులారీలమీద ఏర్పాటుచేసిన ప్లాష్‌లైట్లు కందిచేనుని తెల్లగా పాలసముద్రంలా చేసినయి. కేశవరావు యింకోయిద్దరు యిన స్పెక్టర్లూ ప్రతిఅంగుళం వెతికి చివరికి ప్రస్ఫుటమయిన గోరిల్లారాక్షసి కాలిముద్ర తడిమట్టిలో కనుక్కోగలిగారు. ఒక యినస్పెక్టరు లారీదగ్గరకు పరుగెత్తి కిర్సనాయిల్‌స్టౌ మైనంముద్దా పట్టుకొచ్చి ఆ కాలిగుర్తును అచ్చు తీయసాగాడు.

సూపర్నెంటు గోపాలరావునాయుడు లోపలహాల్లో వెంకట ప్పయ్యతో మాట్లాడుతున్నాడు. జనార్దనరావు సూపర్నెంటుగారి ఎదటగా నుంచొని,

"నేను స్పష్టంగా చూచానండి బాగా ఎనిమిది అడుగుల ఎత్తు వుందండీ. ఆ శరీరం మాత్రం......అబ్బ!......అది రాక్షసేనండి!" అన్నాడు.

"నాకా సెన్సు!. రాక్షసేమిటయ్యా .. అదివదో ఎలుగుగొడ్డో, లేక అట్లాంటి అడవిజంతువో అయివుంటుందిగాని రాక్షసేమిటయ్యా!... రాక్షసి!."అని విసుక్కున్నాడు సూపర్నెంటు.

"అదేమయినా కానీండి తమరు దయయుంచి ఒక యాభయి మందినయినా కనీసం మామేడకు కాపలా ఏర్పాటు చేయించగోర్తాను. అందుకు అయ్యేఖర్చు ఎంతయినా భరిస్తాము ఆర్డరు దయచేయించాలి" నమ్రతగా అన్నాడు వెంకటప్పయ్య. సూపర్నెంటునవ్వి, "యాభయి మందిని ఒక్క మీయింటి దగ్గరేపెట్టి మేమేంజెయ్యం? యిందుకు ఐ. జి. కూడా ఒప్పుకోరు. యిప్పుడు చనిపోయిన యీ యిద్దర్ని గురించి సంజా యిషీ చెప్పుకోటమే చాలాకష్టం....అంతగా మీకు భయంగావుంటే వూరు మారండి......"అన్నాడు.

"ఏలుంటే ఆపని ఎప్పుడో చేసేవాళ్ళం. మా కోడలుకు విపరీతమైన జ్వరం మూడురోజుల్నించి. కదపటానికి వీలులేదని డాక్టరంటున్నాడు...లేకపోతే మిమ్మ ప్రాధేయపడం"

"నేనుచెయ్య లేనిదానికి నన్ను బలవంత పెట్టకండి...అయినా మళ్ళీ ఆ గోరిల్లారాక్షసి మీాయింటికే వస్తుందని నమ్మకం కూడాలేదు... ఏదోగాలిపాటుగా యివ్వాళవచ్చి వుంటుంది." అన్నాడు సూపర్నెంటు.

ఇంతలో కేశవరావు లోపలికొచ్చి,

"చేలో ఏనుగుపాదాల్లాంటి ముద్రలున్నాయి సార్...మైనంతో అచ్చు తీస్తున్నారు.....అది చేలల్లోగుండా రైలు కట్టదాకా వెళ్ళింది అవతల దానిఅడుగులు అగుపడటంలేదు. ఏవోనడిపాత టైర్లకల చిన్న కారు గుర్తులు రోడ్డుదాకా వున్నాయి."

"వాట్. ఆ గోరిల్లారాక్షసి అక్కడనుంచి కారు నడుపుకుంటూ వెళ్లిందంటావా ఏమిటి?" సూపర్నెంటు ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

"గోరిల్లారాక్షసి తాలూకు ఎడంపాదం మాత్రమే కారుప్రక్కగా వుంది...అందువల్ల....ఎవరోదాన్ని అక్కడ వదలిపెట్టే...మళ్ళీ అది రాగానే ఎక్కించుకొని వెళ్ళారనేది స్పష్టం..."

"ఊఁ. నేనుకూడా చూస్తానుపద" సూపర్నెంటు లేచాడు. జనార్ధనరావు గుడ్లప్పగించి తండ్రివంక చూచాడు.

"ఓరి భగవంతుడా!"అని దీర్ఘనిశ్వాస విడిచాడు వెంకటప్పయ్య తలను చేతుల్లో పట్టుకొని.

"నాన్నగారూ!...నాకో ఆలోచన తడుతూంది......యిప్పుడా యినస్పెక్టరు చెప్పిందాన్ని బట్టిచూస్తే......ఎవడో యీా రాక్షసిని కావాలని మనమీాదకే ప్రయోగిస్తున్నాడు......అతడెవ్వరయిందీ మనం తెల్సుకోవలసిందే కాని యీా పోలీసులవల్ల కాదు."

"మనమేం చేస్తాం. రేపు ఐ.జి. ని నేనే స్వయంగా కల్సుకొంటాను."

"ఆఁ. మనఒక్కరి కోసం అకారణంగా వాళ్లేమీా పూనుకోరండి. మనమే ఒకప్రయివేట్ డిటెక్టివ్‌ను పెట్టుకొని యీా రహస్యాన్ని కనుక్కోవాలి. బెజవాడలో ఆనందరావుగారని డిటెక్టివ్ ఒకాయన వున్నాడు. . యిప్పుడే ఫోన్ చేసి పిలుస్తాను" అంటూ టెలిఫోన్ వున్న టేబిలు దగ్గరకు వెళ్ళి 'గైడు' తీశాడు జనార్ధనరావు.

# 5

"నేనే కబురు చేద్దామనుకుంటూన్నాను......యింతలో వెంకటప్పయ్యే పిలిపించాడన్నమాట!......యిప్పటివరకు ఫైలు చూచావు కదూ...నీకేమయినా అభిప్రాయం ఏర్పడిందా?" పోలీసుయినస్పెక్టర్ జనరల్ ఓంకారాచారిగారు సాలోచనగా ఆనందరావు వేపు చూచి అన్నాడు.

"అప్పుడే ఏం తేలుతుందండి! యీా వుదయమేగా నేనువచ్చింది, మీారు అనుకున్న గోరిల్లారాక్షసి తాలూకు కాలిముద్రా వెంట్రుకా పరీక్షించాను. రైలుకట్ట ప్రక్కనవున్న కారుటైరు గుర్తులుకూడా పరిశీలించాను. నాకు ఆ జంతువు ఎత్తుకూ కాలిలావుకూ సమన్వయం కుదరటం లేదు."

జిల్లాకలెక్టరు భవనాల్లో పోలీసు యినస్పెక్టరు జనరల్ కార్యాలయంలో ఆయన గదిలో కూర్చున్న ఆనందరావు సమాధానమిచ్చాడు.

"యివ్వాళ మద్రాసునుంచి రిజర్వుపటాల మొకటి రప్పించబడుతోంది. కృష్ణాజిల్లా తాలూకు పదిహేను పోలీసువ్యానులూ తెప్పించబడుతున్నయి. వెంకటప్పయ్య ఫీజు యిస్తానన్నాడు కనుక నీవుకూడా మాకు సాయపడుతుంటావు. ఎలాగయినా నాల్గురోజుల్లోపల యీా బెడదను వదలించాలి" అన్నాడు ఐ.జి.

"అలాగే ప్రయత్నిద్దాం. శలవు" అన్న డిటెక్టివ్ ఆయన ఆఫీసునుంచి బయటకొచ్చి తన చిన్నకార్లో ఎక్కాడు.

డిటెక్టివ్ ఆనందరావు పాఠకులకు సుపరిచితుడు. యిప్పటివరకు అనేక కేసుల్లో పనిచేసి అఖండఖ్యాతి సంపాదించాడు. వెంకటప్పయ్య గారి కొడుకు జనార్ధనరావు పిలవటంతో వచ్చి, అయిదు వేలరూపా యల ఫీజు మాట్లాడుకొని యీ కేసును చేపట్టాడు.

"ఇప్పుడెటుపోదాం... కారుచక్రందగ్గర కూర్చున్న అతని అసి స్టెంటు వెంకట్రావు అడిగాడు.

"ముందు హోటలుకు పోదాం...ఆ తర్వాత ఎటుపోవాల్సిందీ నిర్ణయిద్దాం" అన్నాడు ఆనందరావు సిగరెట్టు ముట్టించి,

వాళ్ళకారు రైలుగేటుదాటి బ్రాడీపేట సెంటర్లో 'ఆదర్శ భవనం' ముందాగింది,

ముందుసీట్లో కూర్చున్న భీముడు ముందుగాదిగి వెనుక తలుపు తెరిచాడు. ముగ్గురూ ఆహోటల్ రెండో అంతస్తులో మొదటి గదిలోకి ప్రవేశించి లైటు స్విచ్చివేశి కూర్చున్నారు,

"వెంకట్రావు ! నువ్వీరాత్రి డాక్టరు మధుసూదనరావు యింటి వద్ద ఆయన చిన్నకారు టైరుగుర్తులు పట్టుకరావాలి. యిదిగో భీముడూ! నీవు యీతెల్లవార్లూ వెంకటప్పయ్యగారి మేడప్రక్క కందిచేలో ఎవ్వరూ చూడకుండా దాక్కొని ఆరాక్షసి కోసం ఎదురు చూడాలి ...నాపనిమీద నేనుంటాను" అన్నాడు మంచంమీద కూర్చున్న ఆనందరావు

"యిందులో మధుసూధనరావు పాత్ర ఏముంటుంది..."అన్న వెంకట్రావు ప్రశ్నకు ఆనందరావు, "నువ్వొకటి గమనించాలి వెంక ట్రావు! వెంకటప్పయ్యగారిది జమీందారీ కుటుంబం ... యీయన అన్న రాధాకృష్ణయ్య మరణించిన కారణానా, ఇంగ్లాండులో చదువు కొనేందుకు వెళ్ళి అక్కడ ఆయనకొడుకు మరణించటానా, వారి తాలూకు ఆస్తిఅంతా యీయన పరమయింది. మధుసూదనరావు దాదాపు పాతికేళ్ళబట్టీ ఆయింటి వైద్యుడుగా వుంటున్నాడు...ప్రమీ లకు భయంవల్ల వచ్చిన జ్వరాన్ని మూడు నాల్గురోజులుగా తగ్గించ

లేక పోవటమూ, ఆమెని కదిలించటానికి వీలులేదని చెప్పటమూ...— యిదంతాబహుశా—నిజంకాక పోవచ్చు—అనుమానించ టానికి వీలు కలుగ జేస్తున్నయి...అందువల్లను—"

"అందువల్ల అతనికి గోరిల్లారాక్షసికీ సంబధం ఏమిటంటారు!"

"సంబంధం వుందా లేదా అన్నది ప్రస్తుతప్రశ్న కాదు....మనం ఒక విధానము నిర్ణయించుకొని రంగలో ప్రవేశించాలి...అంతే"

"అట్లాగే చేద్దాం" అని వెంకట్రావూ, భీముడూ కిందికిదిగివెళ్ళి పోయారు.

గుంటూరుకు ప్రతిరాత్రి కాళరాత్రిగా వుంది. గోరిల్లారాక్షసి ఏయింటిమీద పడుతుందో ఎవర్ని చంపుతుందోఅని ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకొని బ్రతుకుతున్నారు ప్రజలు. ఐ.జి. గారి అజ్ఞమేరకు అదనపు పోలీసుబలగమూ లారీలువచ్చి, అతిదీక్షతో పట్టణాన్ని కాపాడు తున్నయి.

ఎటువంటి ఉత్పాతాల్లోనూ కాలగమనము ఆగదు. తిండానికి లేకపోయినా డాబు దర్పాలకు వెనుకాడని కవిశేఖరుడూ సహజకవిత్వ బిరుదుతో పాతపుస్తకాల్లోని పేరాలకు పేరాలప్పగించే ఘటికుడూ శవాకార సదృశుడూ అయిన బాలగోపాలకృష్ణ మహాకవిగారి యింట్లో గడియారం పదిఅయిన రాత్రిని తొమ్మిదిగా చూపుతోంది.

ఆయన అన్నపానాదులు ముగించుకొని తాను రచిస్తున్న 'తాటకవధ' అనే ఖండకావ్యానికి తాటక రూపురేఖ లెట్లావుంటయో అని మంచంమీద పడుకొని ఆలోచిస్తున్నాడు.

నాలుగుతరాల క్రితం నిర్మించబడ్డ ఆయనున్న పెంకుటిల్లు నేల భాగం రోడ్డుమట్టానికి రెండడుగుల లోతుగావుండి, బయటి సైడుకాలవ నీరును లోనికి లాక్కునేట్టుగావుంది. కవిగారు పడుకున్న గదికిటికీబయట నల్లగా వికృతంగా నిలబడ్డ రాక్షసిని చూచేటప్పటికి ఊహాప్రపంచంలో తాటకి రూపం ఏర్పడక కొట్టుకులాడుతున్న ఆయన యిహాలోకంలోకి

రాకుండానే ఆలోచించ సాగాడు. కిటికీదగ్గర నిలబడ్డ అసలు రాక్షసి పళ్ళుకొరికి ముక్కులెగనెత్తి వాసన పీల్చటాన్ని-

“చటుల దంతచ్ఛటలు పటపటా రవము లెనయ” అనుకొన్నాడుకవి. రాక్షసి చవిటి గోడలో ఆధారభూతంగావున్న కిటికీని లోతట్టుకు నెట్టివడేసి రెండుచేతులూ లోనికిపోనిచ్చి కవిగారి మంచం కోసం దేవులాడింది.

“తాళప్రమాణ ఘనబాహు యుగ్మంబు-ఆహా-”అనుకొంటున్న మహాకవి బాలగోపాలకృష్ణ ఆ రాక్షసి రెండుచేతుల్లోనూ యిరుక్కొని కిటికీకుండా బయటకువచ్చి గాలిలో తేలియాడ సాగాడు.

యింకా నిజస్థితికిరాని మహాకవి “చటులదంతచ్ఛటలు’ అనుకుంటూనే రాక్షసి విసురుకు కాకిమల్లే ఎగిరి ఎలక్ట్రిక్ తీగలుమీద అడ్డంగాపడి మండిపోయాడు. ఆ కారణంగా ఆ సందుకు విద్యుత్తు ప్రసారము ఆగిపోయి యిళ్ళల్లో జనం భయంతో హాహాకారాలు చేసారు.

ఆసందు చివరనే బంగాళాలో నిద్రిస్తున్న యిన్స్పెక్టరు జనరల్ ఓంకారాచారిగారు పడకగదిలోని లైటు ఆరిపోవటంతో, ఉలిక్కిపడి లేచారు, అంతా చీకటి, ఒరే “వెంకాయ్! వెంకాయ్!” అని కేక వేశాడు కాని ఎవరూ పలకలేదు. ప్రక్కమంచ మీద పడుకొని నిద్ర పోతున్న వారి శ్రీమతి ‘ఊ! ఊ’ అని మూలిగి రగ్గునునిండా కప్పుకొని అటుమళ్ళి పడుకున్నది. ప్రధాన రక్షణ శాఖోద్యోగిగా వున్న ఆ ఆచారిగారికి మానవ సహజమైన భయం ఆవరించటంతో కళ్ళు పెద్దవిచేసి భార్యమంచాన్ని పరీక్షగా చూచాడు. నల్లని ఆకారం-పెద్ద తలా-బారాటి శరీరం-లావుగా మంచంమీద అగుపడింది. ఆయన ధైర్యం సడిలి పెద్దగా “ఒరేయ్ వెంకాయి!” అని యిల్లు అదిరేట్టు కేక వేశాడు,

“అర్ధరాత్రి యీ అరుపు లేమిటండీ!”అని విసుక్కొంటూ లేచిన ఆయనభార్య డ్రాయరు దగ్గరకు వెళ్లి అగ్గిపెట్టెతీసి గీచి కొవ్వొత్తి వెలిగించింది. ఏమీ మాట్లాడకుండా ఆచారిగారూ పడుకొని దుప్పటి తన్ని ముసుగు పెట్టారు.

సాయుధ పోలీసులు సైతం ఒంటరిగా బజార్లలో తిరగటానికి భయపడే ఆ భయంకర నిశిలో వెంకట్రావు నిశాచరుడల్లే ధైర్యంగా డాక్టరు మధుసూధనరావు మేడ కాంపౌండు గోడదూకి కిందహాల్లోకి వచ్చాడు. పోర్టికో క్రింద నిలబెట్టబడ్డ నీలిరంగు కారుదగ్గరకుచేరి టైర్లు పరీక్షించ సాగాడు.

ఫౌంటెన్ పెన్ను లావునవున్న అతనిచేతిలోని చిన్న బ్యాటరీలైటు కాంతి నాలుగు టైర్లనూచూపి మడ్గార్ లోపైపు బురదను చూపసాగింది. సన్నని గులకరాళ్ళూ బొగ్గుచిట్టాలూ స్పష్టంగాచూచి 'యీకారే రైలు కట్ట వెంబడి రాక్షసిని మోసుకొచ్చింది' అని నిర్ణయించుకొన్న వెంకట్రావు నెమ్మదిగా లేచి చుట్టూ తాకలయ జూచాడు.

తలుపులన్నీ వేసివున్నాయి. మేడమీదకు మెట్లున్న గదితలుపులు మాత్రం బయట గొళ్ళెంపెట్టి వుండటాన, వెంకట్రావు గొళ్ళెం తీసి తలుపు నెట్టాడు. తలుపులు విడిపోయి మెట్లు ప్రత్యక్షమవటంతో నిశ్శబంగా మెట్లెక్కి మేడమీదకు చేరాడు.

ట్రాన్సుపారంబలుబు తెల్లనికాంతిని హాలు గోడల రంగు రంగులు దిగమింగుతున్నయి. పై అంతస్తులో మూడుగదులు మాత్ర మున్నయి. దక్షిణపువేపు గదికి లావాటి బ్యాంకితాళం వేళ్లాడుతోంది. వెంకట్రావుదాన్ని తనలైటు వెలుగులో పరీక్షించాడు. తాళానికి తుప్పువట్టటానా చెవిబొద్దులో సాలెగూళ్లుంటాన ఆ గదిచాలా కాలంగా మూసివేయబడి వున్నదని గ్రహించి రెండోగది తలుపును నెట్టి చూచాడు. లోపలగడియ వేసుకొని ఎవరో నిద్రిస్తుండటాన ఆ గది అతనికి సాధ్యం కాలేదు. మూడోగది డాక్టరుగారి పడకగది. సంభ్రమాశ్చర్యాలమధ్య దగ్గరేసివున్న తలుపుల్ని నెట్టుకొని వెంకట్రావు ఆ గదిలో ప్రవేశించాడు. ఆ గదిలో డాక్టరు లేడు.

అత్యంత సుందరంగావున్న డాక్టరు పడకగది వెంకట్రావు చేతిలోని చిన్న కాంతికి గుండ్రని వలయాల్లో అగుపడ సాగింది. పట్టెమంచం, దానివెనుక గోడకున్న కిటికీ, కుడివైపున గోడలోవున్న అద్దాల

అల్మారా, దానిపక్క పది సొరుగులుకల 'రోజ్‌వుడ్' డ్రాయరూ దాని ముందు కుర్చీ, ఎడంవేపు మూడుకుర్చీలూ గదిమధ్యలో 'టేబిల్‌క్లాత్' పరచబడ్డ చిన్నిస్టూలుమీది పూలకుండీ-అన్నిటిని జాగ్రత్తగా చూచిన వెంకట్రావు మొదట డ్రాయరుమీది కాగితాలు పరిశీలించ మొదలు పెట్టాడు.

అక్కడున్నవన్నీ వైద్యానికి సంబంధించిన కాగితాలు. 'స్టేట్ ఎక్స్ ప్రెస్' సిగరేట్లడబ్బా దానిమీదవున్న అగ్గిపెట్టే, తీసి డబ్బాలోని ఏడు సిగరేట్లను లెక్కపెట్టి మళ్ళీ యధాప్రకారం పెట్టేశాడు. కాగితాలక్రింద వున్న 'రైటింగ్ ప్యాడ్'ను తీసి చూచాడు. ఆ అట్టకు మూలమీదవున్న తోలుసంచిలో ఒకచిన్న కాగితం మడతను వెతికి బయటకుతీసి చూచాడు వెంకట్రావు. అది డాక్టరుగారి లెటరు కాగితం. ఆ మడతల లోపల ఏదో వుత్తరం వ్రాయాలని మొదలు పెట్టబడి ఏకారణంవల్లనో ఆపి వేయబడివుంది. ఒకేఒక లైను—"ప్రేయసి ప్రమీలకు," అని మాత్రమే వ్రాశివుండటాన్ని చూచిన వెంకట్రావు ఆకాగితాన్ని జేబులో పెట్టుకొని డ్రాయరు సొరుగులు వెతక సాగాడు. అయిదు నిమిషాల అనంతరం అన్ని తలుపులూ యధాప్రకారం వేసుకుంటూవచ్చిన అతను కాంపౌండుదాటి సందులోకి మాయమయ్యాడు.

రాత్రి పన్నెండింటిదాకా రైలుకట్టమీద నిరీక్షిస్తూ కూర్చున్న ఆనందరావు ఒకసారి వెంకటప్పయ్యగారి మేడనుచూచి వద్దామని బయలు దేరి రైల్వేస్టేషన్ గూడ్సుషెడ్డుదాకా నడచివచ్చి రోడ్డు ఎక్కాడు.

ప్రమీల పడుకొన్న గది కిటికీ దగ్గర దాదాపు అరగంటసేపు నిలబడ్డ ఒకవ్యక్తి ఎందుకనో గోడవెంబడే దొడ్డివైపుగా నడిచాడు.

పిట్టగోడఘూకి మేడఎదురుగా పూలచెట్లల్లోకి దిగిన ఆనందరావు వాతావరణంలో సిగరెట్టువాసన్ని కనిపెట్టి ఎక్కడో ఎవరో సిగరెట్టు త్రాగుతున్నారని చెట్లసందుగుండావంగి వరండాలోకి వచ్చాడు. ఎక్కడా ఏమీ అలికిడిలేకపోవటాన చేతిలోని బ్యాటరీలైటు వెలుగులో ఆ దొడ్డి నంతా పరిశీలించ మొదలు పెట్టాడు.

మేడ వుత్తరభాగంలో గోడప్రక్కగా పడివున్న ఖరీదయిన సిగ రెట్టు పీక యింకా కాలుతునే వుంటాన్ని చూచిన అతడు గబగబా అక్కడకువెళ్ళి దాన్నిపరిశీలించాడు. సన్నజాజిచెట్టు మొదల్లో మట్టి మీద బాటాకంపెనీవారి కాన్వాసుబూటుముద్ర స్పష్టంగా అగుపించింది సిగరెట్టుతోపాటు. వేలికొనతో సిగరెట్టునుఆర్పి ఆ పీకను జాగ్రత్తగా జేబులో వేసుకొన్న ఆనందరావు దొడ్డిఅంతా ఒకసారి కలియతిరిగి వరండాలోకొచ్చి బల్లమీద కూర్చున్నాడు.

## 6

"డాక్టరు గారింట్లో వున్నారా?"

ఎదటబడ్డ పనివాణ్ణి ప్రశ్నించాడు వరండాలో నుంచున్న ఆనంద రావు.

"హాస్పటల్‌కు వెళ్లారండి..." ఎదుట నుంచున్న వ్యక్తికి సమా ధానమిస్తూ దగ్గరకు వచ్చాడు డాక్టరు మధుసూదనరావు నౌకరు.

"ఈ యింట్లో ఎవ రెవరున్నా రేం?"

"అమ్మగారూ పిల్లలూ పైనవున్నారండి. తమరు వారికి బంధు వులాఅండి?...కూర్చోండి...అమ్మగారికి చెపుతాను"

అని వెళ్లబోతున్న అతన్ని ఆపిన ఆనందరావు,"చుట్టాన్ని కాను. పోలీసు ఆఫీసర్ని...అయ్యగారెన్నింటికి వస్తారు?"

"చిత్తం. వచ్చేవేళయింది. కుర్చీ తెస్తాను కూర్చోండి" అంటూ నౌకరు హాల్లోవున్న ఒకకుర్చీ తెచ్చి వరండాలో వేశాడు.

"రాత్రినువ్వు యిక్కడే పడుకున్నావా?" కూర్చుంటూ ఆనంద రావు ప్రశ్నించాడు.

"చిత్తం. కిందహాల్లో పడుకున్నానండి" భయంతో సమాధానం చెప్పాడు నౌకరు.

"రాత్రి డాక్టరుగారు ఎక్కడ పడుకున్నారు"

"రోజూమాదిరే పైన తనగదిలో పడుకున్నారు"

"మరి పిల్లలూ మీ అమ్మగారూ?"

"అయ్యగారి గదిపక్కగదిలో పడుకున్నారండీ"

బయటఆగిన కారులోంచి మధుసూధనరావుదిగి వరండాలోని వ్యక్తిని పరీక్షగాచూస్తూ వచ్చాడు.

"నమస్కారం. డాక్టర్" ఆనందరావు కూర్చొనే అన్నాడు.

"నమస్కారం...!" ఎదటివారిని జ్ఞాపకం చేసుకొనే ప్రయత్నంలో అలాగే నిలబడి పోయిన మధుసూధనరావు అన్నాడు.

"మీతో ఐదునిముషాలు మాట్లాడాలి...తీరికే ననుకుంటాను..." అంటూ ఆనందరావుకూడా లేచి నిలబడ్డాడు.

"అలాగే ఒక్క రెండునిమిషాలు కూర్చోండి...త...మ...రు"

"ప్రయివేట్ డిటెక్టివ్ ఆనందరావును!"

"హలో! హలో! ఆనందరావుగారా!" చప్పున దగ్గరకువచ్చి కరస్పర్శచేసాడు డాక్టరు.

ఆనందరావును మర్యాద పూర్వకంగా మేడమీదకు తీసుకవెళ్ళి తనగదిలో కూర్చోబెట్టి ఒక నిమిషంలో దుస్తులుమార్చుకొని వచ్చి డిటెక్టివ్ ప్రక్క కూర్చొని డ్రాయరుమీది సిగరేట్టు డబ్బాతీసి అందించాడు డాక్టరు.

"డాక్టర్. మీతో అతిముఖ్యమయిన విషయాలు మాట్లాడాలి. తమకు తెలిసినంతవరకు ఏమీదాచకుండా చెప్తుతారని నమ్ముచున్నాను" అంటూ నౌకరు తెచ్చిన కమ్మనికాఫీ చప్పరిస్తూ ఆనందరావు అన్నాడు.

"అలాగే...యింతకీ తమరు ఎవరి తరఫున వచ్చిందీ చెప్పారు కారు"

"నేను మీ మిత్రుడు వెంకటప్పయ్యగారి ఆహ్వానంమీద వచ్చాను. ఆయన్ని ఎవరో... గోరిల్లారాక్షసి రూపంలో...హత్య చేయ్యాలని ప్రయత్నిస్తున్నారు...అదిసరే.........రాత్రి మీరు యింట్లో లేరు. యిప్పటికి మూడు రోజుల క్రితం మీకారు రాత్రి

ఒంటిగంటప్పుడు వెంకటప్పయ్యగారి యింటి ప్రాంతాలలో రైలుకట్టకు అవతలగావుంది......ఏమంటారు ? ”

“ఓహో...ఎదో నానెత్తి మీదకే తెచ్చారే...రాత్రి నేను ఎక్కడికీ వెళ్ళలేదు......”

“అబద్ధ మాడకండి...రాత్రి పది...పన్నెండు మధ్యమీరీ గదిలో లేరు......”

డాక్టరు నవ్వి, “ప్రక్కగదిలో...ఆడవాళ్ళు పడుకున్నారు...”

“ఊఁ. మీరు ప్రమీల పడుకున్న హాలు కిటికీ ప్రక్క సన్న జాజి పొదులో నిలబడి ఎవరికోసమో చాలాసేపు నిరీక్షించారు...... అందుకు మీరు ఆర్పకుండా పారేశిన యీ సిగరెట్టు సాక్ష్యం” అంటూ ఆనందరావు తనజేబులోంచి సిగరెట్టుపీకను తీసి బల్లమీద పెట్టి, “యిప్పుడేమంటారు ? ” అన్నాడు.

“మిస్టర్ ఆనందరావు ! యింకేమీ దాచను. వినండి. నేనూ ప్రమీలా అయిదేళ్ళుగా ఒకర్నొకరు ప్రేమించు కొంటున్నాం. మానవ సహజమయిన ప్రేమ నేరంకాదు కదా......యిప్పుడు మీ ప్రశ్నలన్నిటికీ సమాధానం దొరికిందను కొంటాను” అంటూ డాక్టరు లేచి నుంచున్నాడు.

“నమ్మక తప్పదు......రెండు విషయాలు తెలేదాకా” తాను కూడా లేచిన ఆనందరావు అన్నాడు. “నేను నిన్న చనిపోయిన రాధా కృష్ణయ్య యిన్సూరెన్సు కాగితాలు చూచాను...డాక్టర్... ఆ దక్షిణపు గదివుంది చూచారా! ...” అటువైపు చెయ్యిచూపుతూ “చాలాకాలంనుంచి దాని తాళం తియ్యటం లేదు మీరు...క్రమేణా తెలుసు కుంటాలేండి...వస్తా...శలవు” అంటూ డాక్టరు అంగీకారాన్నయినా తీసుకోకుండా మెట్లుదిగి వెళ్ళిపోయాడు డిటెక్టివ్

ఆనందరావువంకే కన్నార్పకుండా చూచిన డాక్టరు అతనుగేటు దాటగానే యింట్లోకి వెళ్ళాడు.

తరువాత రెండురోజులవరకూ ఎలాటి సంఘటనలు జరుగలేదు. పాతపురాణాలు వెతకటంలోనూ యిద్దరు ముగ్గురు పెద్దపోగాళ్ళ వ్యాపారస్తుల్ని కలుసుకొని మాట్లాడటంతోనూ గడిపిన ఆనందరావు ఆ సాయంత్రం అయిదుగంటలకు వెంకటప్పయ్యగారి మేడముందు పూలచెట్లమధ్య కూర్చున్న ప్రమీలాదేవి ముందు కుర్చీలో కూర్చొని తన పాతకేసుల్లోని విషయాలు చెపుతూ ఆవిణ్ణి ఆశ్చర్యపరుస్తున్నాడు.

"అన్నిటికన్నా .. మీ హైదరాబాద్ కేసు మాత్రం అద్భుతం!" అన్నదామె.

"అందాకా ఎందుకు... ఈ కేసుచూడండి... నేను విచారించి నంతమటుకు ఆలోచిస్తే......మీకుచిన్నతనంలో గోపాలమనే మేనమామకొడుకున్నాడు...మీరెవ్వరూ ఆ విషయాలే చెప్పరు..." అని మ్లానమైన ఆమెముఖాన్ని ఆసక్తితో పరిశీలించాడు.

"చెప్పటాని కేముందండి...పాతసంగతులు తవ్వటమంటే నా గుండెలు బరువెక్కుతయి....గోపాలంబావే బ్రతికుంటే నేను అతన్నే పెండ్లాడి వుండేదాన్ని...పోనీండి ఆ విషయాలన్నీ...యిప్పుడీ గోరిల్లా రాక్షసినిచూచి భయపడుతున్నాంగాని అంతకంటే ఘోరమయిన మనుష్యుల్ని చూస్తూ వూరుకొని వుండటంలేదూ!!"

"అబ్బో; అటువంటివాళ్ళను నేనుచాలమందిని చూశాను. ఆ స్తిపాస్తుల విషయంలో అన్నదమ్ముల్ని హత్యజేసేవాళ్ళని యిద్దర్ని పట్టుకొన్నాను కూడా."

"అటువంటి వాళ్లకు ఏంశిక్ష పడుతుందేం?" కుతూహలంగా అడిగిందామె.

"నేరం రుజువుఅయితే వురితీస్తారు! కానిపక్షంలో ద్వీపాంతర మో ఆజన్మఖైదో వేస్తారు......ఏం.? మీ గోపాలంబావ చనిపోటానికి కారకుల్ని వెదకమంటారేమిటి...కొంపదీసి!!"

"అబ్బే! అదికాదు. గోపాలం చనిపోయిందెట్లాగో తెలుసుకుందామనీ, చనిపోయే క్షణాన అతడు నన్ను తలుచుకున్నాడో లేదో తెలుసు

కుందామని నాకుచాలా కాలంగా కోరిక వుండిపోయింది. యిప్పుడు మీ గొప్పతనాన్ని తెలుసుకొని మిమ్మల్ని చూచిన తర్వాత ఆ కోరిక ప్రబలుతూవుంది....మీరుకోరిన ఫీజు యిస్తాను,..అయితే మీరు దీన్ని రహస్యంగానే వుంచాలి."

"అసలతను చనిపోవటానికి కారణమేమయినా వుంటుందని మీ అనుమానమా ? "

"నన్నేం ప్రశ్నించకండి...అంతా మీరు సాధించి_నేను చని పోయేలోగా నాకు తెలియజేస్తే చాలు...అదుగో మామగారు వస్తు న్నారు..." అంది

వెంకటప్పయ్యగారు వరండాలోంచి పూలచెట్లు మధ్యగా వీళ్ళ దగ్గరకువచ్చి ఖాళీ కుర్చీలో కూర్చున్నాడు.

"వెంకటప్పయ్యగారూ ! మీ అన్నగారు రాధాకృష్ణయ్య చని పోయినందువల్ల మీకేపాటి ఆస్తి కలిసిందండీ ?"

సూటిగా అడిగిన ప్రశ్నకు వెంకటప్పయ్య తబ్బిబ్బుపడి, సమ్హా ళించుకొని "ఆఁ. ఆ స్తిదేం లెక్క లెండి. అసున్నర లక్షలని అప్పట్లో అంచనా వేశాం...పాపం, ఆయనకీ గోపాలానికీ ఋణంలేదు కాని దాంతో నాకేం లాభమండి." అంటూ కళ్ళూ మొఖం పైగుడ్డతో తుడుచుకొన్నాడు.

"మొన్న ఆయన మరణాన్ని గూర్చిన రిపోర్టు చూచాను లెండి పాపం...మధ్యాహ్నం తలనొప్పి...సాయంత్రం మరణం...భలేచావు లెండి...డాక్టరు మధుసూధనరావు ఆయన్నిగురించి చాలాచెప్పాడు... కాని చాలాదారుణం కదండి"

"ఆయన చనిపోయ్యే నాటికి ఆరునెల్లక్రితమే, మేం వ్యాపారంలో జాయింటు విడిపోయాం...నేనేదో అకృత్యం చేసి వుంటానని కొందరు అనుమానించారు కూడా...ఏమీ లేదండి...మద్యాహ్నం రెండు గంటలప్పుడు తలనొప్పి రావటాన డాక్టరు దగ్గరకు వెళ్ళాడు...అప్పుడు నేనుకూడా అక్కడే వున్నాను లెండి...డాక్టరిచ్చిన మందుతాగి ఆయన వెళ్ళాడు——"

"అవును...డాక్టరు చెప్పాడు లేండి...మీరంతా దక్షిణపు గదిలో కూర్చున్నారు కదూ?" వెంకటప్పయ్య చెప్పే మాటలకు అడ్డం వచ్చి ఆనందరావు అన్నాడు.

వెంకటప్పయ్యగారు ఆనందరావు మొఖంలోకి తీక్షణంగా చూచాడు. ఒక క్షణం తర్వాత,

"ఆరాత్రి పదిగంటలకు యింగ్లాండులోవున్న గోపాలానికి కేబిలు ద్వారా తండ్రి మరణ వార్తను తెలియజేసాను...కాని ఉదయం పది గంటల కల్లా గోపాలం మరణవార్త మాకందింది. చూడండి ఎంత దారుణమో!" అన్నాడు.

చీకట్లు అలము కుంటున్నాయి. బజారుదీపాలతో పాటే ఆమేడ దీపాలుకూడా వెలిగాయి. చలిగాలికి జడిసి అంతాలేచారు. మామా కోడళ్ళ దగ్గర శెలవు తీసుకొని ఆనందరావు హోటల్ వేపు నడిచాడు.

ఏడుగంటల కల్లా గుంటూరు నిశ్శబ్దతలో మునిగింది. ఫ్లాషు లైట్లు మోస్తున్న పోలీసువ్యాన్లు అతిజాగ్రత్తగా పట్టణాన్ని కాపాడు తున్నాయి. అమావాశ్య చీకట్లు వాతావరణాన్ని కారు నలుపు చేసి వున్నకాస్త నక్షత్ర కాంతినికూడా భూమిమ్మీదపడకుండా చేస్తున్నాయి.

తెల్లవారుఝామున మూడు గంటలకు హుబ్లీపోయ్యే మెయిల్ అప్పుడే వెళ్ళింది. గోరిల్లారాక్షసివచ్చి మీద పడుతుందేమో నని ప్రయాణీకులు రైలు కిటికీలన్నీ మూసేశారు. రైలుమోతకు భయపడి జొన్నచేలో దాక్కున్న గోరిల్లారాక్షసి తలపైకెత్తి చుట్టూతా చూచి, రైలుకట్ట ఎక్కసాగింది.

చలిగాలికి జలుబు చేసిన కారణంగా మాటిమాటికీ ముంజేత్తో ముక్కు తుడుచుకుంటూ నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ కట్టదిగి కంది చేలోకి ప్రవేశించిన అది వెంకటప్పయ్య మేడకేసి చూచి హుూంక రించి కోపంతో నడకను వేగం చేసింది.

అరవిచ్చి కాయలు కాసిన కంది చెట్లను బుజాల్తో నెట్టుకుంటూ వంగి మోరపైకెత్తుకుని పులిలానడుస్తున్న ఆరాక్షసికి గిలిలాంటి

విగ్రహం - టెలిగ్రాఫ్ స్థంభం దగ్గర నిలుచొని వుండటం కనపడింది. అనుమానం ఎక్కువవటాన నేలబారుకు వంగి గాలిని విపరీతం వాసన చూస్తూ బుసలు పెడుతున్న రాక్షసి శబ్దాన్ని విన్న ఆవిగ్రహం, ఎదురు తిరిగి చేలోకూర్చొని రాక్షసి కోసం పొంచుతేశింది.

గోదాలోకి దిగిన కింగ్ కాంగ్, దారాసింగు లకు మల్లే ఆయిద్దరూ కందిచేనును ధ్వంసంచేస్తూ వలయంగా తిరుగు తున్నారు. రెండు నిమిషాల అనంతరం గండుపిల్లు ల్లా చేతులు కలుపుకొని క్షణంలో ప్రత్యర్థిని గాలిలోకి విసరివేసిన రాక్షసి కుడిదండ మీాదదిగిన బాకును చూచుకుంటూ రక్తాన్ని నాకుకుంటూ రైలు కట్టకేసి నడిచింది.

"రాక్షసేనండి అనుమానంలేదు..." నెప్పిపుట్టిన తుంటిని కుడి చేత్తో సాపుచేసుకుంటూ అన్నాడు. భీముడు.

లైటవెలుగులో ఆనందరావు, వెంకట్రావు, వెంకటప్పయ్య, జనార్ధనరావుల మధ్యగా అతిబలిష్టమైన భీముని ఆకారం కూర్చుంది.

"ఇంతకీ గుర్తులేమయినా దొరికాయా?" ఆనందరావు ప్రశ్నించాడు.

"తెల్లవారుఝాము కదండి... అంతకీ చాలా అప్రమత్తతతోనే వున్నాను. ఆ టెలిగ్రాఫ్ స్ధంభాన్ని ఆనుకొని నుంచున్నాను. యింతలో ఎక్కణ్ణించి వచ్చిందోకాని పదిహేను అడుగులదూరంలో మాటుపెట్టుకొని కూర్చుంది. చీకటి చలి విపరీతంగా కందిచెట్లల్లోంచి వచ్చి వణుకు పుట్టిస్తున్నది. చేలో చీమలూ, పురుగులూ నాకాళ్ళమీాదకు ఎక్కి బాధిస్తున్నయి. ఎందుకో అటు తిరిగి చూచాను. నల్లగా ఏనుగుపిల్లకు మల్లే వంగి మనిషివాసన్ని పసికడుతోంది...మీారు అరవొద్దన్నారు కదూ!...నేనేం మాట్లాడకుండా దానిచేపుకు తిరిగి అది కూర్చున్నట్లే కూర్చొని విచిత్రంగా ఘీంకరించాను...మొత్తానికి అదికూడా కొంచెం జంకినట్లుంది. నావైపే దృష్టినిగుచ్చి కొంచెం అయిదారు అంగుళాలు ముందుకు కదిలింది...నా కాలును ఏదో గండుచీమ కరిచేస్తున్నది అయినాకది తే ప్రమాదమని అలాగే నాగ్రుడ్లు దాని కగుపడేంతగా పెద్దవి

చేసి నేనూ కొంచెం కదిలాను. అది ఆటవులి మాదిరిగా ఒక చెయ్యి చాచి వూపుతూ నా మీదకు మూకటానికి ప్రయత్నించింది. నేను బాకు నోట్లోపెట్టుకుని పైదుప్పటిని నేలమీదికి జార్చి యింకొంచెం ముందుకువచ్చి చూశాను...చిన్నతలకాయ...మామూలు మనిషి తలకాయంతే వుంది...పొడుగాటి జుట్టు మెడలమీదా బుజాలమీదా పడుతోంది. ముక్కూ, నోరూ...అంతా మనిషే కాని క్రింది దవడ నుంచి ముఖంమీదకు పొడుచుకొచ్చిన రెండుకోరలు తెల్లగా వున్నాయి. చాలా తక్కువ మెడ ఆ ఏనుగలాంటి శరీరంలో కూరుకుపోయి వుంది. అరచెయ్యి తెల్లగా ముడతలుపడి వుంది. అయిదారు అంగుళాల పొడుగ్గా చేతివ్రేళ్ళంత లావునా తెల్లగా గోళ్ళున్నాయి. గుండెలమీద విపరీతంగా బొచ్చు వుంది...బాగా లోతుకుపోయిన కళ్ళు కాంతిలేక తోర్రల్లా అవుపడుతున్నయి. అది జరిగిన కొద్దీ ఏదో షుదపుకంపు నా ముక్కుల్ని బ్రద్దలుకొట్టసాగింది. ఎంతో వోపికా ధైర్యం తెచ్చుకొని కందిచెట్లను నేలమట్టంచేస్తూ దానిచుట్టూ తిరగసాగాను—.దానికి అయిదడుగుల దూరంలో..."

వెంకటప్పయ్యగారు రాక్షసి ఆకారాన్ని వూహించుకొంటంవల్ల అంత చలిలోనూ ఆయనకు ముచ్చెమటలు పోశాయి.

"ఇంతకీ అదిమనిషా.. జంతువా?" ఆనందరావు అడిగాడు.

త రు వా యి రెం డ వ భా గం చ ద వం డి.

**గమనిక:-** యీ నవలలోని వ్యక్తుల పేర్లు, సంఘటనలు, కేవలం కల్పితాలు, ఎవర్నీ ఉద్దేశించి వ్రాసినవికావు.



ఆంధ్రరత్న పవర్ ప్రెస్, రైల్వేస్టేషన్ రోడ్డు, మారీసుపేట, తెనాలి.

# పుస్తకముల జాబితా

| | రు.అ. |
|---|---|
| అగస్త్యప్రోక్తము | 2- 4 |
| దాంపత్య రహస్యములు | 2- 0 |
| కామకళ (లేక కొక్కోకము) | 1- 0 |
| హఠయోగప్రదీపిక | 3- 8 |
| వేదాంత రహస్యదర్పణము | 1- 8 |
| శ్రీరామ వనవాసము | 2- 0 |
| పంచపాండవుల వనవాసము | 1- 8 |
| ,, అజ్ఞాతవాసము | 2- 0 |
| గృహవైద్య రత్నాకరం | 1- 0 |
| స్త్రీభవిక్తజయం (20 మహాపతివ్రతల కథలు) | 1- 8 |
| వర్తక మర్మములు | 1- 8 |
| పాతంజలయోగశాస్త్రము | 1- 8 |
| ఆయుర్దాయదీపిక | 2- 8 |
| జ్ఞానసింధువు | 2- 0 |
| వేదాంతసార ప్రశ్నోత్తరావళి | 2- 0 |
| కార్తీక పురాణం | 1- 8 |
| కార్తీక మహాత్మ్యం | 1- 8 |
| అష్టపదులు | 1- 8 |
| మాఘ పురాణం | 1- 8 |
| ముహూర్త దర్పణము | 1- 8 |
| 28 వ్రతాలు | 2- 0 |
| భట్టివిక్రమార్కుని కథలు | 4- 0 |
| ,, చిన్నది | 1- 0 |
| కాశీమజిలీలు 12 భా॥ భా॥ 1కి | 4- 0 |
| పులిప్పాణి వైద్యము | 2- 0 |
| యీశ్వరమ్మగారి చరిత్ర | 3- 0 |
| సిద్ధయ్యగారి చరిత్ర | 2- 0 |
| శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారి బోధామృతము | 2- 8 |
| వీరబ్రహ్మంగారి జీవితచరిత్ర | 3- 4 |
| బ్రహ్మంగారి స్టేజీనాటకం | 1- 0 |
| పదునారు రాజుల కథలు | 1- 0 |
| శ్రీ మద్భగవద్గీతా బ్రహ్మోపదేశ ఆంధ్రవ్యాఖ్య | 5- 0 |
| శ్రీ మదాంధ్ర భాగవతము దశమస్కంధము పూ. భా. | 3- 8 |

| | రు.అ. |
|---|---|
| మదనకామరాజు కథలు | 2- 4 |
| కాశీరామేశ్వర మజిలీకథలు | 2- 0 |
| సనాకి విశ్వేశ్వర సంవాదము | 2- 0 |
| మైరావణ చరిత్ర | 1- 8 |
| పెద్దబాలశిక్ష | 1- 0 |
| శ్రీ మద్రామాయణ వచనము | 2- 0 |
| శుక బ్రహ్మ కైవల్యము | 1- 8 |
| సహస్రశిరచ్ఛేద అపూర్వచింతామణి | 4- 0 |
| వైకుంఠ మహాత్మ్యం | |
| సకల దేవతలు వశీకరణముగు సులభాకర్షణమంత్ర రహస్యము | 2- 0 |
| స్త్రీల పాటలు | 1- 8 |
| మంగళహారతులు 1-2 భా. భా. 1కి | 1- 0 |
| శుకసప్తతి కథలు | 1- 0 |
| బాలనాగమ్మ కథ | 0-12 |
| పెద్దబొబ్బిలి రాజుకథ | 0-12 |
| దేశింగురాజు కథ | 0-12 |
| సన్యాసమ్మ కథ | 0-12 |
| భద్రాచల రామదాసు | 0-12 |
| యడ్ల రామదాసు | 0- 8 |
| తారకామృత సారము | 0-12 |
| ఆత్మబోధామృత తత్త్వము | 0- 4 |
| కాలజ్ఞాన తత్త్వములు | 0- 8 |
| వచన కాలజ్ఞానము | 0- 4 |
| సత్యనారాయణ వ్రతం | 0- 8 |
| గోసాయి చిటికెలు | 0- 8 |
| బైరాగి చిటికెలు | 0- 8 |
| ముగ్గుల పుస్తకము | 0- 4 |
| పంద్రెండు రాజుల కథలు | 1- 0 |
| శ్రీకృష్ణ రుక్మిణీ సంవాదము | 1- 4 |
| అధ్యాత్మ రామాయణం | 1- 0 |
| దస్తావేజుల మతలబు | 1- 8 |
| సారంగధర నాటకము | 0-10 |
| సర్మాంగద చరిత్ర - పాముపాట | 0- 8 |
| సహదేవ పశువైద్యం | 0- 8 |
| నీతి శాస్త్రము | 0- 4 |
| నవగ్రహ చింతామణి | 0- 4 |